# రే[illegible]షింగు కథలు

[వినోద కథల సంపుటి]



రచన

జ్యోతికుమారి.

1950 ★



# రెండవ జా


| | |
|---|---|
| విడుదల: | దిపాళి |
| చిత్రకారుడు | బి. జి. |
| సర్వహక్కులు | ప్రకాశకులవి |
| ముద్రాపకులు | రెడ్డి ప్రింటింగు ప్రెస్. |
| మూల్యం | రూపాయి. |

# మా మాట

దీపావళి వెలుగుల్లో మా రెండవ జ్యోతి ప్రచురణను మీకు అంద చేస్తున్నాము. మా తొలి జ్యోతి ప్రచురణ సందర్భంలో పాఠకుల అభిమానాన్ని కృతజ్ఞతతో స్వీకరించాము. దాని ఫలితమే యీ 'రేపటి కథలు' అను కథల సంపుటి. పుస్తకపు అందచందాలను గూర్చి మేము చూపిన శ్రద్ధ మీకే విశదమవుతుంది.

మా ప్రచురణల విషయంలో పాఠకుల అభిప్రాయాలను సహృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాము.

[illegible]

కర్నూలు
9-11-50

విధేయులు
[illegible]

# పరిచయం

పామరుడి నుండి పండితుని వరకు మానసికానందాన్ని పొందడానికి కాని, విజ్ఞానాన్ని సంపాదించడానికి గాని సాహిత్యమొక ముఖ్య సాధనము.

అట్టి యీనాటి అధునిక సారస్వతములో చిన్నకథ ఒక మహత్తర [illegible]ము. చిన్న కథకున్న ప్రాధాన్యతకు నాగరకత ఒక కారణమని చెప్పక తప్పదు. నవీనుడు భారమైన గ్రంథములను చదువుటకు కాలమును వినియోగించలేడు. తానెప్పుడును అత్యవసర కార్య కలాపములతో నిండి యుండును. కావున సూటిగానున్న చిన్నకథలను ఇష్టముగ చదువగలడు.

ఏది ఏమైనను యిరవయ్యో శతాబ్దములో [పాశ్చాత్య సాహిత్యపు సంబంధముతో] చిన్నకథ అత్యున్నత స్థానమలంకరించినది.

కాని చిన్నకథ వ్రాయుటంత తేలిక కాదు. మరియే యితర సారస్వత రూపంలోనూ గాఢంగా చిత్రించలేని, వెలికి తేలేని సంఘటనల్లక్ర నగ్న సత్యములను చిన్నకథలో సూటిగా, చురుకుగా అమర్చవచ్చు. [illegible]లైనన్ని తక్కువ పాత్రలతో మనోరంజకమైన [సుఖాంతమే దుఃఖాంతమే గాని] విషయమును హృద్యమంగా చిత్రించ గలిగిన చిన్నకథకు పూర్తి రూపము చేకూరగలదు.

ప్రజానీకంలో మూడు తరగతులున్నవి. ఇందులో మధ్యతరగతి కుటుంబీకుని దైనిక జీవితమే ముళ్లబాట. తను సంపాదించుకొన గ[illegible]

దానితో కడుపునిండా తిండి, వంటికి బట్టా ఏర్పరచుకోలేదు; తన ఆదాయాన్ని ఒంటరిగా వదిలి, జీవిత అవసరాలకు కావలసిన వస్తువుల ధరలన్నీ విపరీతంగా పెరిగిపోయాయి గనుక. పోనీ యితరులను చెయిజాసి అడిగేందుకు ముంచుకవచ్చే అభిమానం ఒకటి.

ఈ స్థితిలో యిరుకున పడ్డ మధ్యతరగతి కుటుంబీకుని జీవితాన్నే భిన్నకోణాల్లో యీ 'రేషనింగు కథలు' చూపుతవి.

నిత్యజీవితములో మనం సాధారణముగా విస్మరించే బరువైన సంఘటనలకు యీ పుస్తకమొక దర్పణము. ముఖ్యముగా రేషనింగు ప్రవేశపెట్టబడిన పిమ్మట లెక్కకు మిక్కిలిగా సమస్యలు తలెత్తాయి. వాటిని యథార్థ కోణంలో చూసి, అధికారుల అత్యాచారాలనూ, అమాయకుల అవసలను వెలుగులోకి తేవడానికి, ప్రజల యదార్థ స్థానాన్ని చూపడానికీ ప్రయత్నించిన రచయితలను వేళ్ళమీద లెక్కించవచ్చు. అందులో యీ గ్రంథకర్తది ప్రథమ తాంబూలం.

సాహిత్యానికి ప్రపంచ గమనానికి సన్నిహిత సంబంధం వున్నప్పుడే అది రాణిస్తుంది. ప్రజాబాహుళ్యానికి ప్రయోజనకారిగా వుంటుంది. అందుచేతే పరిసర వాతావరణాన్ని స్మృతిపథంలో వుంచుకుని కివేడి సమస్య సహజంగా చిత్రించిన రచనలు అత్యుత్తమంగా యెంచబడినవి.

ఈ నగ్నసత్యాన్ని దృష్టిలో పెట్టుకొని సమస్యలను సాగతీసి అంతరార్థాన్ని గ్రహించి, ఎంతో రమణీయంగా, భావగర్భితంగా పబడిన కల్పిత కథలే యీసంపుటము.

'కార్డుకోసం' అన్న కథలో సామాన్య కుటుంబీకుడు రేషను కార్డుకోసం పడేబాధ, అల్పజ్ఞానంతో అధికారాన్ని చలాయిస్తూన్న గుమస్తా

గిరి అహంకారం అతి సహజంగా చిత్రించబడింది. డబ్బుకు సంఘంలో ఎలాంటి స్థానమున్నదీ, డబ్బున్నవాడి విషయంలో అధికార వర్గం ఎలా ప్రవర్తించేదీ కళ్ళకు కట్టినట్లు చూపుతుంది. 'మా కేలోకం' మనం తెలివిగా వుంటే అధికారులను ఎలా బోల్తా తినిపించవచ్చో విప్పి చెప్పుతుంది, 'నల్లమార్కెటు'. తప్పు మానవ సహజం. [వుద్యోగీ సాధారణ మానవుడు. తప్పటడుగు వేసినట్లే వేస్తాడు, అన్న విషయం 'నిర్దోషి' లో కేటతెల్లం చేయబడింది.

ఈ గ్రంథకర్త ప్రయత్నం విజయవంతమైనదని చెప్పడానికి, "స్వార్థపుకోణంలో" 'అడకత్తెర' 'శేషనిం...' 'మల్లెమొలక' అన్న కథలు ప్రబల నిదర్శనాలు.

కథలలోని పాత్రలను నైతికంగా కట్టుబడునట్లుచేసి కథాగమనానికి సొంపుచేకూర్చడం, చెప్పదలచుకొన్న పెద్దవిషయాన్ని ధారాళ భాషనుపయోగించి వీలైనంత చిన్నవాక్యంలో చెప్పగల్గడం గ్రంథకర్తని విశిష్టత.

పుస్తకం మొదటినుంచి చివరి వరకూ శైలి ధారాళంగావుంది. కథలలో వుపజ్ఞ, వుద్వేగము స్పష్టముగా కనుపిస్తున్నవి.

పుస్తకమంతా చదివాక, మరికొంత నిరంతర కృషితో యీగ్రంథకర్త విశాలాంధ్రలోని అత్యుత్తమ తెలుగు కథకుల్లో ఒకరు కాగలరన్న దృఢ విశ్వాసం కలిగింది.

మనోరంజకమైన మరికొన్ని వుత్తమ కథా [illegible] లనీ గ్రంథకర్త త్వరలో ఆంధ్రావనికి అందివ్వగలరన్న ఆశతో.

సెలవు తీసుకొ

మిత్రుడు

తెనాలి [సం] ఆలపాటి సాంబ[illegible] వు.

సంపాదకుడు, 'వాణిజ్య

# ★ కార్డుకోసం

జీవిత నాటకంలో రసవత్తరమైన ఘట్టం, యౌవన రంగంలోని తొలికాపు. ఇలాంటి విచిత్రానుభూతిని పొందడానికి వీలైనదే కొత్త కాపురం. సతితోడి సౌఖ్యంలో లోకాన్ని మరచిపోయే ఘడియలవి మానవునికి. ఆక్షణాలు నింపారిన కొద్దిదినాల జీవితమే చాలని లొట్టలు వేస్తుంది యౌవనరక్తం. కాని నా స్వానుభవంలో- యీమధుర క్షణాలలో నేను సరైన సుఖాన్ని పొందలేక పోయాను. అందుకు కారణం మా కొత్త కాపురంలో రేషనింగు సమస్యలు అడ్డుకున్నాయి. వ్యవహారమంతా మాటుమణిగి పోయాక, గుమాస్తాల వెంటపడి మళ్లీ మొదలు ఎత్తుకోవలసి వచ్చింది.

సగౌరవంగా, యీ రేషను గొడవనుంచి బయట పడడానికీ, ధీమాతో మార్పులేకుండా వుండడానికీ, లోలోపల

ఎంతో కృంగిపోయాను. కొత్త కాపురం అని మురిసినంత సేపు పట్టలేను, అదంతా నట్టికష్టాల పోగని తెలుసుకోడానికి. ఈ రేషనింగు కాలంలో తలెత్తిన కాపురాల్లో సుఖపడ్డవాళ్ళు శూన్యమనుకుంటాను. ఈతిబాధలు విపరీతంగా పెరిగాయామె.

మనం విలువను అణికించి, జీవించడానికి ఆధారంగా చేసుకున్న, ఆకార్డుకోసం కాలుకు బలపం కట్టుకొని తిరగ వలసి వచ్చింది. ఒక్క గుమస్తా [అందులో స్కూలుఫైనలు పూర్తిచేసిన వారేలేరు] కూడా తేల్చిచెప్పలేదు- డిగ్రీ తీసుకున్న నాముఖంలో అతనికి సంస్కార లక్షణాలు కనుపించ లేదేమో?... నిజమే! స్కూలులో కొనుక్కునే విద్యకూ, స్వానుభవంలో లోకంలోంచి పుంజుకునే సంస్కారానికీ ఎంతో తేడావుంది. విద్య సంస్కారానికొక సోపానమాత్రమే.

కొత్త కార్డులు సృష్టించే గుమాస్తాను తెలుసుకోడానికే తలప్రాణం తోకకు వచ్చింది. ఒక్కరూ అడిగిన ప్రశ్నకు సరిగ్గా సమాధానం చెప్పిన పాపాన పోలేదు. చిత్తు కాగితాలు చూచుకుంటున్న [అంతకన్న చెయ్యాల్సిన పనేమిటో అతనికసలు తెలియదు] వాడల్లా ఔసరమైన రిపోర్టు ఏదో వ్రాస్తున్నట్లు నటించేవాడు.

అసలు గుమాస్తాను వెతుక్కొని వెళ్ళి నా సంగతి చెప్పాను. అరగంట ఆలోచించి, తనగొడవ తనకే అంతు పట్టక, వెతుకులాడి ఒక దరఖాస్తు ఫారం తీసియిచ్చాడు. ఫారం తీసుకొని,

"ఇది పూర్తి చేసే పద్ధతి?"

అన్నాను నాకు తెలిసికూడా. కాస్సేపు మాట్లాడకుండా ఆగి, కనుబొమలు చిట్లించి, "ఇప్పుడు కాదు చేతినిండా పని వుంది!" అన్నాడు. ఇంతసేపూ కూర్చోమన్నైనా అనలేదు. లౌకికమర్యాద కోసరమన్నా మాట్లాడకుండా వెళ్ళి పావు గంటలో పూర్తి చేసుకొని వచ్చి మీదకు విసిరాను.

  

నేను కాఫీకని వెళ్తున్నప్పుడు ఆ రేషను గుమాస్తా ఎదురుగా వస్తున్నట్లు చూశాను. కాని చూసీచూడనట్టు నడుస్తున్నాను! ఆ ఒక్క చూపులోనే అతని ఆలోచనలను చదివాను. అతను ఆత్మగౌరవంతో కాలిపోతున్నాడు. తను రేషను ఆఫీసులో వుంటంచేత నేనేముందు విష్ చెయ్యాలన్న ధీమాతో నడుస్తున్నాడు. లోకంలో నీతిగా బ్రతకడం చేత

గాక యిల్లాంటి స్వల్ప మర్యాదలకోసం తాపత్రయ పడేవాళ్లను నేనసలు జనాభాలో లెక్క వేసుకోను. అతను దగ్గరిగా వచ్చాడు. తప్పని సరిగా నాముఖంలోకి చూస్తూ " నమస్తే " అన్నాడు. నేను చిరునవ్వు ముఖంతో కుర్చీ చూపించి "రండి" అన్నాను.

[illegible] కాఫీ త్రాగుతున్నాం...

" నా కార్డు యివ్వడానికి యింకా ఎంత కాలం పడుతుంది ?" అన్నా.

కాఫీ గ్లాసుదించి, చిరునవ్వు పెదిమల మీదికి తెచ్చుకొని "త్వరగా కావాలా?" అన్నాడు.

నాకు అతనిమీద తేలిక భావం కలిగింది. ఈ ప్రభుత్వోద్యోగులు ప్రజలకు ఏపనీ త్వరగా చేసిపెట్టక్కరలేదు. అట్టల్లో కాగితాలుకట్టి ఆరునెల్లు వుంచకపోతే సరి. వచ్చేకోపాన్ని ఆపుకొని, "అక్కర్లేదు. రేషనింగుకార్డు యివ్వడానికి సరిగ్గా ఎంతకాలం పడుతుందో అంతా తీసుకోండి. అనవసర ఆలస్యం చేయకపోతే చాలు." అన్నా.

నాకోపానికి అతను కొంచెం బెదిరాడు. లేని వినయాన్ని తెచ్చిపెట్టుకొని, అడుగున మిగిలిన కాఫీ పీల్చుతూ చెప్పాడు.

'ఎందుకులెండి రేపీపాటికి మీకార్డు వస్తుంది. కాని... నా విషయం...?'' పూర్తిగా చెప్పలేక వేళ్లను తలలోకిదూర్చి తిప్పుకున్నాడు.

"ఏమిటంటారు?''

" ఏమీలేదు. కార్డుతీసుకున్న ప్రతి వాళ్లూ ...?'' నసిగాడు.

అతని ధోరణి అర్థం కావడంతో నావళ్లు మండి పోయింది. వచ్చే వుద్రేకాన్ని బిగపట్టుకొని అన్నాడు.

"లంచం!"

సన్నగా తలవూపాడు శేషను గుమాస్తా.

తప్పుడు త్రోవలు తొక్కుతున్న వీళ్లకు లంచాలిచ్చి ప్రోత్సహించడం ఆత్మవంచన చేసుకోవడమే! కడుపుకు తినేందుకేమో పర్మిషన్ కావాలి. ఆసంబారాలు తెచ్చుకునేందుకేమో లంచం కావాలా? ఇదే స్వతంత్ర భారతంలో పరిగతి!

"ఎంతకావాలి?" అన్నా పరీక్షగా?

"మీయిష్టం" గర్వంతోనే చేతులు నలుపుకున్నాడు.

"లంచం" బెదిరిపోతున్న అతని దృక్కులను పరికిస్తూ అన్నాను, "లంచాలు యిచ్చి పెంచడం నాకిష్టంలేదు. అసలు లంచగొండి తనపు మరొక స్వరూపమే నల్లమార్కెట్టు. లంచాలతో మిమ్మల్ని నింపి ఏవర్తకుడు ఆవస్తువులను అసలు ధరలకు అమ్మి బాగుపడగలడు?"

అతను జవాబు చెప్పలేదు.

"నాకార్యం విషయంలో మీ ఆఫీసరు నే కలుసుకుంటాను."

ముఖం మాడ్చుకున్న వాడల్లా, విచిత్రంగా తలకాయ తిప్పాడు "వెళ్ళండి; ఆఫీసరు దగ్గరకే. అతనైతే కాసి మేంతీసుకునేదానికి మూడురెట్లు అడగడూ?"

నాకు ఆశ్చర్యం కలిగింది. పెద్దఅధికారులు కూడా యిలా తేలికగా జారిపోతున్నారు అల్పవిషయాల్లో. ఐనా యిదంతా వొక రేషనింగుముఠా. ఒకరిసంగతి మరొకరికి తెలుసు. ఆఫీసరు తింటాడని గుమస్తా అసూయపడడు. గుమాస్తా రాజుగారి కిరీటాలకోసం బల్లక్రింద చెయ్యిచాస్తాడని అధికారికి తెలిసినా కావాలని మరచిపోతాడు.

మా సంభాషణ ఆగిపోయాక అతను ముఖాన్ని అదో విధంగా తిప్పుకున్నాడు. నేను బిల్లుచెల్లించి వచ్చేలోగా అతను జనంలోంచి దూసుకొని వెళ్లిపోయాడు.

తర్వాత నెలరోజులు గడిచిపోయింది. ఆరాత్రి భోం చేసి కూచున్నాక, ఆకుమడిమలను అందిస్తూ జ్యోతి అన్నది:

"రుక్మిణి భర్తకు వుద్యోగం పోయింది. మీకు తెలుసా?... అబ్బ ఆవుద్యోగం వున్నంత కాలం మిడిసి పడిపోయాడు."

జ్యోతి చాలావిషయాలు చెప్తుంటుంది, నేను తీరిగ్గా వున్నప్పుడు. ఎక్కువ విషయాలకు వూకొడుతూనే ఆలకించడం నాకలవాటు. కాని యీవిషయంలో నాకెందుకో వుత్సాహం కలిగింది.

"ఎవరా రుక్మిణి భర్త"

మడిచిన ఆకును నోటికి అందిస్తుండగా నేను కావాలని కొరకడంచేత, చుర్రుమన్నవేలు తీసుకొని వూదుకుంటూ, "ఏమిటండీ! కొంటెపనులు," అని నాకళ్లలోకి కోరగా చూసింది, "రుక్మిణిభర్త మీకు తెలియదా? రుక్మిణీ నేనూ ఒక బళ్లో చదువుకున్నాం"

"తెలియదు."

"శేషనింగు ఆఫీసులో కార్డు యిచ్చే అతనండి. ఉద్యోగం వున్నప్పుడు కొన్న సామానంతా యిప్పుడు అమ్ముకు తిన్నారు. రెండు రోజుల్నుంచీ తిండికికూడా లేదట!"

"ఓహో! అతనా!" రుక్మిణికి పండిన విడెం అందిచ్చాను, "అతను నాకూ తెలుసు" అన్నాను శేషనింగు ఆఫీసులో నాకు జరిగిన అనుభవాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

"ఔనండీ! రుక్మిణి నా స్నేహితురాలు. ఐనా లంచాల మీద సంచులు నింపుకోవడం ప్రారంభించాక, కనపడ్డా పలకరించడం మానేసింది," అన్నదిజ్యోతి, రుక్మిణి స్థితికి జాలి పడకుండానే.

"అతను చాలా గర్విష్టి జ్యోతీ. లంచం లేంది ఏపనీ చెయ్యడు. కర్కశత్వంతో కడుపు నింపుకునే అలాంటి వారికి లోకంలోని ఏమూలనుంచీ సానుభూతిరాదు!" అని, మాట్లాడుతూ మాట్లాడుతూ నిద్రపోతూన్న జ్యోతి ముంగురులు సరిదిద్దడంలో లీనమయ్యాను నేను.

  

ఇంటికి వెళ్లాలనే ఆత్రంతో వడిగా నడిచి వెళ్తున్నాను. వెనకనుంచి ఎవరో పిలిచినట్లైంది. కాని నేను నడుస్తూనే వున్నాను పిలిచినవారెవరో నిర్ధారణంగాక.

"ఇదుగో మిమ్మల్నే నండి ఒక్కమాట!" మళ్లీ వినిపించింది. వెనక్కి తిరిగి చూశాను. అతను ఆపాత రేషనింగు గుమాస్తా వడివడిగా వచ్చి నాదగ్గర నిలిచాడు.

ఎందుకు పిలిచారు అన్నట్లు ప్రశ్నార్థకంగా చూశాను నేను. ఏమీ మాట్లాడడానికి తోచలేదు కామోసు,

"మీరు బిర్లాలో మేనేజరటగా?" అన్నాడు.

తల వూపాను.

మళ్లీ ఓనిముషం ఆగాడు.

"మీకు తెలుసా?" అని అడిగాడు.

"ఏమిటి?"

నీళ్లు నములుతూ చెప్పాడు, "నా వుద్యోగం పోయింది. ఇల్లు జంజాటకమై పోయింది."

"... ...?"

"పది రూపాయలు యిస్తారా? మా మామయ్య వచ్చాక యిచ్చేస్తాను."

"ఎందుకివ్వాలి?" సూటిప్రశ్న వేశాను.

"బాకీ" ఎంతో వినయంగా అడిగాడు. వుద్యోగం పోయాక వెనకలేని నమ్రతవచ్చింది.

"ఆత్మాభిమానం అమ్ముకున్న మీకు ఏమి చూసి యిస్తాను?"

అతను నిశ్శబ్దంగా నిలుచున్నాడు.

అతనికి వుద్యోగం పోయినా ఆ కాలంలో అలవాటైన దురలవాట్లు పోలేదు. పేకాట, జూదం ఆడుతున్నాడు. ఎంత తేలిగ్గా డబ్బును సంపాదించాడో, అంత తేలిగ్గా దాన్ని ఖర్చు పెట్టుకోగలిగాడు కూడాను. ఒకప్పుడు బియ్యపు బస్తాలలో మునిగి తేలినతనికి యీనాడు తిండికిగింజలు లేవు. ఇదంతా నాకు జ్యోతివల్ల తెలిసింది.

"క్షమించండి!" అన్నాను వున్నట్లు వుండి.

"మీమేలు మరచిపోలేను. నేనెట్లాఐనా నా భార్యను పుట్టింటికి పంపేందుకైనా చార్జీలకు డబ్బులేదు," అన్నాడు

దైన్యంగా. నిజంగా అతనిమీద నాకు జాలి కలుగలేదు. అతన్ని వొదిలించుకోవడమే చిక్కైపోయింది. జేబులు తవిడి రూపాయికాసు తీశాను. అది అతని చేతిలో వుంచి,

"బాకీకాదు...పూరికెనే తీసుకోండి"

అన్నాను. రూపాయి యిచ్చినందుకు అతనికి కోపం వచ్చింది. కాని ఏమీ అనలేదు. వచ్చిన రూపాయి పోతుం దన్న భయంతో జేబులో వేసుకొని, ముఖ కవళికల్లో కృతజ్ఞతన్నా కనబరచకుండా చరచరా వెళ్లిపోయాడు.

  

# మారేలోకం!

అధికారి కర్కశ స్వరానికి సత్యం తలవంచుకుని నిలబడ్డాడు. తప్పుకు పోవడానికి మార్గాలు ఏవీ కనుపించడంలేదు. అధికార గర్వంతో తన ఎదుట నిలచిన సర్కిలు నిప్పులు కక్కుతున్నాడు. గాలి కబురుకు వూతంయిచ్చి, స్వయంగా వచ్చి యిల్లంతా గాలించి, కిరసనాయిలు డబ్బా బయటకు లాగాడు. జీవితంతో మగ్గిపోతున్న అతనిగుండె కలుక్కుమన్నది. ఆ కిరసనాయిలు డబ్బా తన స్వంత వాడుకకు ఎక్కువ డబ్బు చెల్లించి కొన్నదే. కాని అమ్మిన వాడికి లేని నేరం, కొన్న తనమీద ఆరోపింపబడింది.

బూటు మడమతో ఘట్టిగా చప్పుడు చేసి, "ఏమిటి యింకా ఆలోచిస్తావ్...స్టేటుమెంటు వ్రాసి యివ్వు ?—" సర్కిలు బెదిరించాడు. దైన్యంగా శూన్యంలోకి చూసి కంటతడి పెట్టాడు సత్యం. పెండ్లి పేటాకులు లేని అతనికి యీ సంఘటనలో

సానుభూతి చూపే వాళ్లయినా ఎవరూ కనపించలేదు. తనకు తాను క్రుగ్గి అభిమానంతో క్రుంగిపోవలసిందే!

సత్యం చేతులు వణికాయి. "వ్రాస్తాను...చెయ్య కూడని పని చేశాను...లోకం తప్పొప్పులు గుర్తింప లేదు..." అన్నాడు. అధికారి క్షణంలో వివరాలు వ్రాసు కొని వెళ్ళిపోయాడు.

సత్యానికి సమయానికి తనదనుకున్నది ఏదీ అక్కరకు రాలేదు. ఔన్నత్యానికిగల విలువతో లోకం అసమర్థుడి మీద దండయాత్ర చేస్తున్నది. అలాంటప్పుడు దానిలో తనొక సామాన్యజీవి. అధికారి కళ్లనుండి ఆవేశ పూరిత మయ్యాయి. పరోక్షంలో నల్లమార్కెటు ధర్మాన జీవించే న్యాయాధిపతి సత్యానికి రెండువందలు జరిమానా విధించాడు. కడుపు కక్కుర్తితో బాధపడుతున్న అతను తనలో తాను కుమిలిపోయాడు.

  

ఇది తర్వాత ఆరేండ్లకు జరిగిన విషయం—

నల్లమార్కెటు జోరుగా సాగుతున్నది. పెంకుటింటి

కష్టాలోంచి సత్యం కట్టిన నాలుగంతస్థుల మేడ వెలిసింది. మిల్లు యజమాని కూతురును వివాహం చేసుకున్న సత్యం యింటినిండా బంధువులు కిటకిట లాడారు. అతడు ఈనాడు అనాధకాని అసహ్కారం లేనివాడుకానీ కాదు. గాలిలో పోయిన ఆరులక్షల ఆస్థిలో, ఉప్పులను కొని తెచ్చుకున్నాడు. అందరికీ అతనిప్పుడు పూజ్యుడు. "సత్యంగారు మహానీయుడు...జీవితపు విలువను తెలుసుకొని సార్థక పరుచుకున్నాడు..." అన్నవి మామూలు గొంతుకలన్నీ.

అదే సమయంలో- వెనుకటి అధికారి అవూరికి బదిలీ అయ్యాడు. చార్జి తీసుకోగానే ఆఫీసుపని వెన్నంటి వెటాడింది. ఆఫీసు కాగితాల్లో పౌరుల అర్జీవుంది. అధికారి ముఖం కళ వళ పడింది. సత్యంగారి మీద రిపోర్టు చేశారు వాళ్లంతా. న్యాయానికి వెనుకటి సంఘటన అధికారి స్మృతిపథం దాటి పోయింది. కాని అవూరు రాగానే తెలిసింది; గ్రామం మొత్తాన్నీ సత్యంగారనే వ్యక్తి హడలగొట్టుతున్నాడని. అతను మునిసిపల్ చైర్మెను. అలాంటి మనిషిమీదే పౌరులు అర్జీపెట్టారు. పౌరులకు అయిష్టమైన వ్యక్తికి, అలాంటి పదవి ఎలా దొరికిందన్న అనుమానం అధికారికి కలుగలేదు - లోకంలో డబ్బుతో కొనలేనిది ఏదీలేదు గనుక.

అధికారి విషయాలన్నీ ఆలోచించుకొని తొందర పడ్డాడు. ప్రజలు వత్తిడి చేసేనంత మాత్రాన తను ముందడుగు వేయకూడదు. కౌన్సిలరుమీద ప్రయోగానికి తనూ తలయొగ్గితే, ఉద్యోగానికే స్వస్తి చెప్పాల్సి రావచ్చు. త్వరగాలేసి దుస్తులు వేసుకొని, సైకిలు తీసుకన్నాడు. ఆర్డిని అమలులోకి తీసుక వచ్చేందుకు అతనికి అంతకన్నా మార్గంలేదు.

కౌన్సిలరు యింటికి వెళ్లి, "సత్యంగారున్నారా?..." అనడిగాడు అధికారి. లోపలకు వెడుతూన్న ఒకావిడ విసురుగా, "మేడమీద కాఫీ త్రాగుతున్నారు. వస్తారు..." అంది. అధికారిని ఎవరూ కూర్చోమనలేదు. ఆయింటిల్లిపాదికీ తెలుసు, సత్యంవెంట అధికారులు పిల్లుల్లా తిరుగుతారని. తలా, కాళ్లు మాడే ఎండలో నిలుచున్నాడు అతను.

సత్యం మేడమెట్లుదిగి, ట్వీడు కోటు సరిచేసికొంటూ లోపలకు వెళ్ళబోతున్నాడు. అధికారి నాలుగుమార్లు నాలుక కొరుక్కొని, "గుడ్ యీవెనింగు!" అన్నాడు. సత్యం వెనక్కు తిరిగి చూసి, "ఏం పనిమీద వచ్చారు. కొత్తగా వచ్చింది మీరేనా?" అన్నాడు. అధికారి తల పంకించాడు.

కాని దుఃఖం వుబుకుతోంది. శ్రీమంతుడికి సహాయం చేయ డానికి వచ్చినా తనకు మర్యాద జరుగలేదు.

"మీామీాద రిపోర్టు వచ్చింది... పంచదార కట్టలు అవీ త్వరగా దాచెయ్యండి... అధికార రీత్యా సోదాకు వస్తాను..."

గబగబా అన్నాడు అధికారి. సత్యం నవ్వి తలూపి "అంతేగద... ఆవని సెర్చికి వచ్చినప్పుడైనా చెయ్యొచ్చు... అన్నాడు సర్కిలు భుజం తట్టి.

అధికారి "శెలవు" అని వచ్చిన త్రోవన వెళ్ళాడు 'నీకేం భయం లేదిహ' అన్నది అతని హృదయం.

  

# ★ నల్లమార్కెటు

వృద్ధాప్యంలో దినాలు దొర్లించుక వస్తూన్న వెంకటప్పకు యిది రెండో భారం. తన కడుపుకాలి చేతికక్కర కొచ్చిన కొడుకు సన్నిపాతంలో శాశ్వతంగా నిద్రపోయాడు. ఎదిగే కొడుకును చూసుకొని వృద్ధాప్యంలో తను కాలు కదల్చకుండా కాలాన్ని గడపవచ్చని కలలుగన్న దినాలన్నీ వెంకటప్పకు స్మృతికి వచ్చి మనస్తాపం కలిగించేవి.

కలోగంజో కాచుకొని రెండో కంటివాడికి తెలియకుండా తనసంసారం జరుగుతూన్న సమయంలోనే వచ్చి పడింది రేషనింగు. పట్టుమని రూపాయికి మానెడు గింజలు దొరకవు. రోజంతా శరీరాన్ని కరగదీసుకున్నందుకు వచ్చే ముప్పావలాతో ఇంటెడంత సంసారం గడవాలి. వెంకటప్ప స్వయంగా కూచుని ఆలోచించేటప్పుడు మనస్సంతా కలవర పడేది. ఊరికరణం పేపర్లో చదివే మంత్రుల తగాదాలు,

కొత్త సినిమాలు, రూపాయి పెట్టుబడితో ఐదువేల లాభం... మొదలైన వార్తలు గుర్తుకువచ్చి పిచ్చిగా నవ్వుకొనేవాడు అతను.

అనుకుంటూ అనుకుంటూ వుండగానే స్వారాజ్యం వచ్చిందన్నారు. సభలన్నారు, మీటింగులన్నారు. తీరా ఆ దినానికి అన్నప్రకారం బీదలకు అన్నమే పెట్టలేదు. పొట్టచేత పట్టుకొని తనవంటి అభాగ్యులంతా 'స్వరాజ్యోత్సవం' లో సంతోషించే దేమిటో వెంకటప్పకు తెలియలేదు.

తర్వాత దినాలు మరీ విషమించాయి. వెంకటప్ప మటుకు పనికివెడుతూ ఒకపూట గత్యంతరంలేక సంసారాన్నంతా పస్తుంచుతూనే వున్నాడు. పుట్టెడంత బలగంలో పట్టుదలకన్నా ఒకపూట తిండిపెట్టిన పాపాన పోయినవారు లేరు. నేదర పిల్లల్ని చూసుకొని, పొద్దస్తమానమూ వంటింట్లో మ్రగ్గిపోయే భార్యను చూసి అభిమానంతో కాలిపోయేవాడు వెంకటప్ప. 'డబ్బంటే' తను రెక్కలమ్ముకొని సంపాదిస్తాడు కాని, హోదాలో, ధనవంతుల ప్రాపకంలో సాగిపోతూన్న ప్రపంచంలో తనవంటి అసమర్థుడికి కంట్రోలు ధరకు ఏవస్తువైనా దొరకడం కష్టమే!

వెంకటప్ప రాత్రంతా ఆలోచించేవాడు మరునాడు తిండిగింజలు ఎట్లాగా అని. తన తాహతుకు నల్లమార్కెటులో కొని భరించలేడు. కొందామన్నా అలాంటి వాటికి అనుసరించాల్సిన పద్ధతులు ఎన్నడూ తెలుసుకోలేదు.

అతను పనిలోనుంచి యింటికి వచ్చేసరికి పిల్లలంతా చుట్టూచేరి, "అమ్మ యీపూట అన్నం పెట్టలేదు నాన్నా !!" అని బిక్కమొఖం పెట్టేవాళ్లు. ఆచిన్న హృదయాలను వెంకటప్ప మాటలుచెప్పి తృప్తిపరచలేక మనసులో బాధ ననుభవించేవాడు.

వెంకటప్ప ఆరోజు ప్రక్క గ్రామం నుంచి బండికట్టుకొని వస్తున్నాడు. ఆవూరి శెట్టి తను పని చేస్తున్న షావుకారు బావమర్ది. ఒకనాడు కనుపించి, "మావూరు వస్తే తక్కువ ధరకు బియ్యమిస్తాను. నీవు అమ్ముకో" అని చెప్పాడు. ఆరోజు దీర్ఘంగా ఆలోచించకుండానే మరో నాల్గురోజుల్లో వస్తానని చెప్పి వెళ్లాడు. వాగ్దానం ప్రకారం ఆనాడు బండి కట్టుకొని వెళ్ళి అరబస్తా బియ్యం తెస్తున్నాడు.

అతను ఆలోచించిన పద్ధతి ఒకటి. కరువు కాలంలో తనకు స్వగ్రామంలో ఎంత ధరకైనా గిద్దెడు గింజలు దొరకవు.

తను యీ ప్రయత్నంలో బయటపడ్డాడంటే తనుపెట్టిన పెట్టుబడి పోను ఎనిమిది మానికలన్నా బియ్యం మిగులుతాయి. కృశిస్తున్న పెళ్ళాం సహా పిల్లలు రోగంలో మునిగి వున్నప్పుడు గంజికైనా కావలసిన గింజలు సంపాదించడానికి వెంకటప్పకు అంతకన్నా మార్గం కనుపించలేదు.

వర్షానికినాని మెత్తబడ్డ నేలమీద బండి గంటలు చప్పుడుతో సాగిపోతూంది. వెంకటప్ప బుర్రలో ఆలోచనలు కూడా అదేస్థాయిలో తొణికిసలాడుతున్నాయి. బండి వూరు సమీపంగా వచ్చింది. తను ఫర్లాంగు దూరంలో వున్న పోలీసు స్టేషను దాటుతే మరేమీ భయం వుండదు. అక్కడే అసలు ఒక పెద్దగండం.

అతను వుద్రేకంలో ఎద్దులను అదలించి బండి తోలుతున్నాడు. పోలీసుస్టేషను ముందు బండి వడివడిగా నడుస్తూంది.

“ఎవరది? బండిఆపు... నిన్నే!” స్టేషనులోనుంచి శబ్దం కటువుగా వచ్చింది. వెంకటప్ప మొదట కొంచెం అశ్రద్ధ చూపాడు. మళ్ళీ అదేమాట కొంచెం హెచ్చుస్థాయిలో వినిపించింది. ఎద్దులు కదలకుండా నిలుచున్నాయి. బూట్ల

చప్పుడు దగ్గరగా వచ్చింది. పిలుస్తే వినపళ్ళేదూ? బండి స్టేషను లోనికి రానీ" వెంకటప్ప నిశ్శబ్దంగా బండి లోపలకు తెచ్చి ఆపి దిగి నిలుచున్నాడు.



★

రైలు పది నిముషాల కన్నా ఎక్కువ ఆగదు. బియ్యపు మూటలూ, మనుషులూ రైలెక్కాలి. అందుచేత పగిపుల పెట్లెలు కూడా వాళ్లవే!

★

మరో పావుగంట కల్లా ఎర్ర బట్టలు వెళ్ళి నిద్రపోతూన్న సబ్ యినస్పెక్టరును లేపుకొచ్చాయి. నిద్రచెడ్డ విచారం కన్నా అనుకోకుండా కనపించిన బియ్యం యిచ్చిన ఆనందం ఎక్కువైంది అధికారికి. వెంకటప్పను నిలబెట్టి ఏవో ప్రశ్నలు వేశాడు. అధికారి పుస్తకంలో ఏదో గీసుకున్నాడు కూడా. మరోక్షణమాగి "ఇది మొదటి కేసు, యిలా దొంగతనంగా

బియ్యం యెత్తుక పోవడం పెద్దతప్పు. ఈమారు క్షమించాను" వెంకటప్ప ముఖంలోకి చూసి అన్నాడు, "ఇంకోమారు యిలా చేశావంటే శిక్షపడుతుంది."

వెంకటప్ప నిశ్శబ్దంగా తప్పటడుగులు వేసుకుంటూ బయటపడ్డాడు. తను మాట్లాడుతున్నంతసేపూ అదే కొత్త కావడంవల్ల వణికిపోయాడు. అధికారికి అరబస్తా బియ్యం వదలి తను వృత్త చేతుల్తో యిల్లుచేరుకోవాలి. మళ్ళీ తను తిండిలేక జబ్బునపడ్డ భార్యఎదుట నీళ్ళు నములుతూ కూచోవాలి. చాలీ చాలని తిండితో దినాలు గడపాలి. వెంకటప్ప బండి మెల్లిగా సాగిపోయింది. ఆరాత్రే నల్ల మార్కెటు బియ్యం అధికారి యింటికి చేరాయి.

చేసిన ఒక్క ప్రయత్నమూ వృధాకావడం వెంకటప్పకు చాలా నిరుత్సాహమూ, బాధా కలిగించింది. నలుగుర్లో నోరులేని తనకూ అధికారుల అత్యాచారాలు కనిపిస్తూనే వున్నాయి. తనవంటి అభాగ్యుణ్ణి వంటరిగా పట్టుకొని "నల్లమార్కెటు" అని బెదిరించి అధికారి ఆకాసిని బియ్యాన్ని తనయింటికి చేర్చుకున్నాడు. ఇదేనా అధికార్లు నల్లమార్కెటు నిర్మూలనానికి చేయాల్సినపని! ప్రభుత్వం వీళ్ళను నియ

మించింది బీదలనోళ్లు కొట్టి విందులు చేసుకోడానికా?...
ఇలాంటి ప్రశ్నలు పుంఖాలు పుంఖాలుగా అతని స్మృతి పథాన
తట్టినయి. కాని సంస్కారం, విజ్ఞతా లేని వెంకటప్ప
తాత్కాలికంగా ప్రతీకారం చేయలేకపోయాడు.

ఆసమస్యే అతను తీరిక దొరికినప్పుడల్లా ఆలోచించాడు.
తనను మోసగించిన అధికారికి తెలివి నేర్పాలని అతని పట్టు
దల. సిబ్బందిని తన చేతుల్లో వుంచుకొని ప్రజానీకాన్ని [అస్కా-
రం లేనివాళ్లను] పీడించి దోచుకుంటూన్న అధికారులను
తనెలా మోసగించాలో అతనికి అర్థంకాలేదు.

ఏదో ఒక ఆలోచన తట్టింది వెంకటప్పకు. మరునాడు
సమీపంలోని బూడిదకుప్పంతా త్రవ్వి బస్తాలకు నింపించాడు.
బండిమీద బస్తాలు వేసుకొని ప్రొద్దుగూంకాక బయలుదేరాడు.

రెండెద్దుల బండి సాగిపోతూంది. అదేపోలీసు స్టేషను
వద్ద ఆ కేక వినుపించింది.

"ఎవరది... బండి ఆపు!"

వెంకటప్ప మామూలుగా బండి లోవలకు తోలి ఆ
పాడు. పోలీసు జవాన్లు వెంకటప్పను చూచి కొంచెం ఆశ్చర్య

పడ్డారు వెనుకటి దోషే కావడంవల్ల. ఈమారు వెంకటప్పను వేరే ఒకగదిలో బంధించారు. సబ్ యిన్‍స్పెక్టరు వచ్చాడు. కేసు పెద్దదికావడంవల్ల ఎన్‍క్వయిరీ ఆఫీసరుకూడా పిలుపు వెళ్లింది.

అధికారుల ముందు వెంకటప్ప చేతులు కట్టుకొని నిలుచున్నాడు. ఇనస్పెక్టరు ఆఫీసరుకు ఎరుకపరిచాడు, అతను వెనుకటి నేరస్తుడేనని. ఆఫీసరు వెంకటప్పను గదిమి అడిగాడు విషయమేమిటని. ఆకలితో చనిపోనున్న కుటుంబం కోసం తను బియ్యం బస్తాలు తెస్తున్న మాట నిజమేనన్నాడు వెంకటప్ప జంకుతూ జంకుతూ. "ఈమారు శిక్షపడకతప్పదు!" అన్నాడు అధికారి.

జవాన్లు బస్తాలుదించి మూతులు విప్పారు. ఆశ్చర్యంతో అధికారి దగ్గరకు వచ్చి "బస్తాలలో వూదంతా బూడిదండీ!" అన్నారు గగ్గోలుగా.

వెంకటప్ప క్షణంకూడా ఆలస్యం చేయకుండా గోలకు లేచాడు తలపీక్కుంటూ.

"నన్ను కొట్లోబంధించి నాబియ్యాన్ని యిలా నాశనం చేశారు. బీదవాణ్ణి యింతడబ్బు పోయి మట్టితిని బ్రతకాలా?

బాబూ" అన్నాడు కళ్ళల్లో నీళ్ళునింపుకొని. ఆఫీసరుకు యీ గొడవంతా అగమ్యగోచరంగా వుంది. ఆ ముసలాడు గోల పెడుతూనే వున్నాడు. "ఆరుబస్తాల బియ్యం ఎవరి కడుపున పెట్టుకున్నారో?" అని కడుపు మండిపోయినట్లుగా అంటున్న వెంకటప్ప మాటలకు సమాధానం చెప్పలేక గుడ్లప్పగించి నిలుచున్నాడు అధికారి.





రైలు రాకకు ఎదురు చూస్తున్నారు. బియ్యపు మూటలతో యిక్కడ చేరదాకా వాళ్ళ గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతవి పాపం!



లోలోపల గొణుక్కుంటూనే, "ఎక్కువ ధరలో కొన్నవి. నాకొంప కూలకుండా అసలు ధరన్నా యిప్పించండి దొరా" కళ్ళమ్మట నీళ్ళు టప టపా రాలాయి.

ఈమారు ఎన్‌క్వయిరీ ఆఫీసరు సమాధానం చెప్ప డానికి ఎక్కువ కాలం తీసుకోలేదు. [illegible] కాలంలో యూనిఫారం [illegible] డానికి ఆధారం ఏమీ కనిపించలేదు. ఇన్స్పెక్టర్ను పిలిచి, "కంట్రోలు ధరకు డబ్బు ఇవ్వాలి!" అన్నాడు అధికారి. వెంకటప్ప బిక్క ముఖంతో [illegible]

మరుక్షణానికి అతనిచేతుల్లో ఆరుబస్తాల కంట్రోలు ధరా ఇన్స్పెక్టరు జేబులోంచి వచ్చి [illegible] విస్మరించినట్లు బిక్కమొఖంతో బయటపడ్డాడు [illegible]

ఎద్దులబండి పోలీసుస్టేషను కాంపౌండు దాటింది. గంటల శబ్దంతో బండి తూర్పుదిక్కుగా సాగిపోయింది.

నల్లమార్కెటు మటుకు నశించలేదు.

[ఆంధ్రాధారం]





# • రేపనింగు ముఠా

పెండ్లి భోజనాల సగంలో కలవరం బయలుదేరింది. ఒక్కగాను ఒక్క కూతురుకు ఘనంగా పెండ్లి చేసుకుంటున్న ఆ షావుకారు గ్రామం నాలుగుమూలలా భోజనానికి పిలిచాడు. సగం భోజనం పూర్తయింది. అనుకోకుండా బాంబు తునకలా వచ్చిపడింది. రేపనింగు ముఠా పంక్తులుతీరి కూర్చున్న ప్రజల్లో కలవరం బయలుదేరింది. నోటిదాకా ముద్ద ఎత్తినవాండ్లు కొందరు ఆగిపోయారు. ప్రతివ్యక్తి మనస్సులోనూ అర్థంకాని ఆ విచిత్ర ప్రవృతి కలిగింది.

సీతారామయ్య అణుమాత్రం కూడా జంకలేదు. హాలుమధ్యలో నిలుచుని పనులు పురమాయిస్తున్నవాడల్లా ఆమాటవిని కొద్దిగా చకితుడయ్యాడు. తనేది జరగడానికి వీలున్నదనుకున్నాడో, అదే కార్యరూపంలోకి వచ్చికూర్చుంది. కుడిచేతిలో కలం జరుపుతూ, రెండో చేతిని లంచా

లకు చాచే నైతిక పతనాన్ని పొందిన అధికార వర్గాన్ని చూస్తే అతనికొక విధమైన నిరసనభావం కలిగింది. జీవితా దర్శాన్ని తెలుసుకోని అధికారులను తనెందుకు గౌరవించాలా?... అనుకున్నాడు. ఆ కారణాన్ని పురస్కరించుకునే తను యీవిషయంలో ప్రతిఘటించి నిలవాలనుకున్నాడు.

చుట్టం చూపుగా వచ్చిన అతిథులకు యీ గొడవ ఒక గొప్ప సమస్యలా నిలిచింది. తాము ఎన్నో కార్యాలకు హాజరయ్యారు కాని, యిలాంటి సంఘటన మాడుముఖం వేసుకొని శుభకార్యంలో ఎదురవలేదు. ప్రాపంచిక వ్యవహారాలలో ఎంతో విజ్ఞత చూపుతూ, పరిచయుల మన్ననలను పొందిన శీతారామయ్య యీ చిన్నవిషయంలో ఎందుకు తప్పటడుగు వేశాడా? అనుకున్నారు. నిజానికి యీనాడు ప్రపంచం హేయమైన పరిస్థితుల ననుసరించి పోతున్నది. న్యాయానికీ, ధర్మానికీ కట్టుబడిన వానిమీద లోకం, నల్లేరుమీద బండిలా జరిగి పోతున్నది.

అలాంటి పరిస్థితుల్లో అధికారుల చేతులు తడిపి ముందుగానే అతను జాగ్రత్తపడి వుండాల్సింది. కాని అతనెన్నడూ ఆలాటిపనికి పూనుకోదలచలేదు. ఎలాంటి విషమ క్షణాల

లోనూ తన వ్యక్తిత్వానికి దెబ్బతగలకుండా జాగ్రత్త పడు తున్నాడు. లోకంలో మానవుడు ఏముఖ్యోద్దేశ్యంతో జనిం చాడో దానిని విస్మరింప దలచలేదు. బ్రతకడానికి, కడుపు నిండా తింటున్న ప్రాణి, కడుపు మండించుకుంటున్నానని చెప్పు కోవడం సిగ్గుచేటుగా తోచింది సీతారామయ్యకు.

రేపనింగు ముకావచ్చి 'సీతారామయ్యగారున్నారా? ఈపెండ్లి చేస్తున్నది వారేకదూ?...' అన్నారు. వడ్డన చేస్తున్నతను తన యజమానిని కేకవేశాడు. నిర్భయంగా అడుగులు వేసుకుంటూ వచ్చి నిలుచున్నాడు సీతారామయ్య.

అధికారికే ముచ్చెమటలు పోశాయి, ఆస్థితిలో వచ్చి నిలుచున్న సీతారామయ్యను కదల్చి మాట్లాడడానికి. విశాల మైన ఫాలభాగం, సంస్కార లక్షణాలను వ్యక్తపరచే చురు కైన కండ్లూ, పుస్తకాలు కంఠస్థం చేయకుండా, ప్రపంచంలో స్వానుభవం ద్వారా సంపాదించిన విజ్ఞానమూ, అతనిలో కొంత ప్రత్యేకాకర్షణను ఏర్పరచాయి.

"ఏమిటి పిలిచారు?... ఏదో పనిమీద వచ్చారే?" అన్నాడు బొంగురు పోయిన కంఠంతో సీతారామయ్య. ఆర్థి కంగా కూడా ఒక్క చిక్కని తను, మృత్యువును తప్పిస్తే—

మరి దేనికీ భయపడవలసిన అగత్యం లేదన్న ధీమా అతనిలో వుంది.

అధికారి హృదయంలో సానపెట్టబడిన మాటలు, మందంగా బయటకు వెలువడినయి. 'ఇంత బహిరంగంగా పంక్తులు పెట్టారు. ఈ బియ్యం అన్నీ ఎలా వచ్చాయి?...' అన్నాడు ఆఫీసరు.

శీతారామయ్య మెల్లిగా నవ్వాడు. ఒక ప్రక్క భోజనాలు జరుగుతున్నయి. అతిథులంతా బహిరంగంగా అధికారవర్గంతో తగాదా వేసుకున్న శీతారామయ్యను చూచి విస్తుపోయారు.

'ఇవి మీ కంట్రోలు బియ్యంకావు. అవి ఇంతబాగా అన్నం కావుగదూ?' అన్నాడు. శేషనింగు ఆఫీసరు తోక త్రొక్కిన త్రాసులాగా ఐపోయాడు. వీధిబేరంలో సంచులు నింపుకొనే షావుకారు తనస్థితి గతులను బోధపరచుకోకుండా, పరాచకానికి దిగుతాడా? అనుకున్నాడు. అప్పటికే అనేక మంది, ఆవీధి వర్తకులు కూడా చేరారు. ఈకొత్త ఆఫీసరు శీతారామయ్య తడాఖా ఎప్పుడూ తినలేదులావుంది— అనుకున్నారు వాండ్లు.

"నాలుగు వందలుపైగా మనుష్యులు భోజనాలు చేస్తున్నారు. కేసు పెడుతాను, అన్నాడు రేషనింగు ఆఫీసరు.

శీతారామయ్య కొంచెం ముందుకు జరిగి, " మీరు వూహించి చెప్పడంవల్ల పొరపాటు పడ్డారు. చీటిప్రకారం ఐదువందల నలభైమందిని భోజనాలకు పిలచాం..." అని ఒక్క క్షణం ఆగి, "ఐతే మీరేమంటూరు యిప్పుడు" అన్నాడు.

ఆఫీసరు కాస్సేపు మాట్లాడలేక పోయాడు. తనకు ఏకోణంలోనూ అందకుండా సమాధానం చెప్తూన్న వర్తకుడి వైఖరి విచిత్రంగా కనుపించింది. "ఏదైన లాభంలేదు. బహిరంగానికి వచ్చింది——" అన్నాడు.

'అంటే...' యజమాని ప్రశ్న వేశాడు.

'ఏమీలేదు. మీమీద రేషనింగు రూలుకు వ్యతిరేకంగా నడచినందుకు కేసుపెడుతాను. రేపు ఆఫీసుకు వచ్చి కనపడండి.'

"సరే అలానే కానివ్వండి. వీలుంటే తప్పక ఆఫీసుకు వస్తాను."

నల్లమార్కెటు బియ్యంతో భౌతికంగా బలిసిపోయిన

అధికారి, ముందుకు కదిలాడు. సరిన్యైన లంచం దొరక నందుకు నిరుత్సాహపడి, అనుసరించారు గుమస్తాలు.

శీతారామయ్యమీద అభియోగం తెచ్చాడు రేష నింగు ఆఫీసరు. ఈవిషయంలో పట్టుదలతో నిలిచినందుకు, ఆ పెండ్లి పెద్దకు న్యాయం జరిగి తీరాలని ప్రజానీకం ఎదురు తెన్నులు కాసింది. విచారణకు కూడా న్యాయవాదిని, శీతా రామయ్య ఏర్పాటు చేయలేదు. వ్యవహారమంతా తనే స్వయంగా చూసుకున్నాడు. ఆత్మబలం, విజ్ఞతా వున్నంతే కాలం తను యితరులమీాద ఆధారపడ దలచలేదు. భూమి అంతా కంపించి పోయేలా ప్రజానీకం చేస్తున్న గొదకు తనే ఎదటపడి వాదించాలనుకున్నాడు. మనసున్న న్యాయాధిపతి ఏమి సమాధానం చెప్పగలడో తను వినాలనుకున్నాడు.

విచారణరోజు కోర్టు హాలంతా నిండిపోయింది. రేష నింగు గొడవతో తలపట్టి, నిరుత్సాహ పడిన ప్రజలంతా గుమికూడారు. న్యాయాధిపతి ముఖంలో అవ్యక్తమైన వ్యథ ఏదో వెంటాడుతున్నట్లు గోచరించింది.

రేషనింగు ఆఫీసరు చెప్పిన అతుకుల వుపన్యాసం విని, 'మరి నీవు దీనికంతకూ ఏమని సమాధానం చెప్తావ్?...

ఆఫీసరు రూలుకు వ్యతిరేకంగా నడిచినందుకు నిన్ను పట్టుకున్నా డట' అన్నాడు న్యాయాధిపతి.

శీతారామయ్య స్థయిర్యంగా నిలబడి, "కాదు అక్కడే వారు పొరబడ్డారు. నన్ను వారు పట్టుకోలేదు. వారి కార్యాన్ని వారు సరీగ్గా నిర్వహింపకుండా తక్కువ సంఖ్యను లెక్క వేసుకుంటే నేను ఆఫీసరులోని తప్పు పట్టాను..." అన్నాడు శీతారామయ్య.

హాలంతా నవ్వులతో మారుమ్రోగి పోయింది. కోర్టు వారు నిశ్శబ్దంగా వుండాలని హెచ్చరించారు. శీతారామయ్య చెప్పిన సమాధానానికి ఆఫీసరు ముఖం రక్తహీనమైంది. న్యాయాధిపతి యోచించుచూసి,

'పోనీ నీవు అంతమందికి ఏ బియ్యంతో భోజనం పెట్టావు. అది తప్పేనని అంగీకరిస్తావా?' అన్నాడు. శీతారామయ్య యిక్కడకూడా చిక్కలేదు. ముఖంలో వుద్రేకాన్ని నేకరించుకొని, 'దానికే సమాధానం చెప్తాను, నల్లమార్కెటు బియ్యం ఆనాడు నేను కొన్నాను. కాని అది తప్పుకాదు' నా సేవు ఆగాడు అతను.

'పరిభుత్వం పరిజానీకాన్ని వంచి అబద్ధాలకు అభ్యాసాన్నిస్తున్నది. శేషనింగు లేనినాడు సామాన్య మానవుడు ఎంతతిన్నాడో, యీనాడూ అంతే తింటున్నాడు. కానీ చాల నిది రహస్యంగా పంపాదిస్తున్నాడు. పోతే మీరు కడుపు నిండా తింటూ అర్ధాన్నం తిన్నామని అబద్ధమాడాలని ప్రేరేపిస్తున్నారు.

'చెప్పండి. నాస్వానుభవంలో కడుపుకోసం నేను వెరవలేదు. ఈక్షణంలో యిక్కడున్న అధికారుల్లో ఎవరు అర్ధతిండి తిని జీవిస్తున్నారు. అలాతింటే భౌతికంగా మనం యిలా వుంటామా?

"ఒక్కమాట; ఆఫీసరు నాతో లంచం యిమ్మని వ్యంగంగా మాట్లాడాడు. కల్మష పూరితంగా అతను తన కర్తవ్యాన్ని పూర్తి చేస్తున్నాడు. సాక్ష్యాలు సిద్ధం చేసే వుంచాను...'

శీతారామయ్య మాటలు గంగా ప్రవాహంలా దొర్లాయి. హాలులోని వ్యక్తులంతా నిశ్చేజితులై పోయారు. ఉత్సుకతతో అతని ముఖం ఎర్రపడింది. న్యాయాధిపతి సిగ్గుతో కాలిపోయి, ఆత్మాభిమానంతో కంపించిపోయాడు.

యదార్ధ దృశ్యాలుగా వర్ణించిన ఆవర్తకుడి మాటలు తోసి పుచ్చి, అభిమానం కోసం అన్యాయానికి పాల్పడలేక పోయాడు అతను. తనకూ హృదయం వున్నదనుకున్నాడు న్యాయాధిపతి. అతని కన్నులలో సన్నని నీటితెర కదిలింది. శీతారామయ్య చెప్పిన వాక్యాలలో అక్షరం కూడా అబద్ధంగా కనుపించలేదు.

న్యాయాధిపతి వెళ్ళిపోయాక ప్రజ వర్తకుడిని అభినందిస్తూ, వీధికి తరలారు. న్యాయవాదులకు యిదొక చిత్రమైన వ్యాజ్యమై కూచుంది. తీర్పును ఏఆకారంలో నూ వాళ్లు వూహింపలేక పోయారు.

వారం రోజులకు తీర్పు వాయిదా పడింది. వర్తకుడి సాక్ష్యాలు కేసుకు బాగా పనిచేశాయి. తీర్పునాడు న్యాయాధికారి కంఠంలోని తుది వాక్యాలు 'అధికార వర్గాన్ని దూసుకొని బయటపడ్డాయి.

నిశ్చితమైన దృష్టితో నిలుచుని, 'ఈవ్యాజ్యం శేషనింగువారు పెట్టిన అభియోగానికి సరియైన కారణాలు స్పష్టపడలేదు. కేసు కొట్టివేస్తున్నాను' అన్నాడు న్యాయాధిపతి.

అఫీసరు ముఖం మరొకమారు వెలవెలా పోయింది.

అధికారం కోసం ప్రాకులాడే వ్యక్తులు, న్యాయాధిపతి మీద [మనసుల్లో] అసూయపడి నిందించారు. శీతారామయ్య మటుకు సత్త్వగుణాన్ని వ్యక్తపరుస్తూ, కార్యవాదియై వెలుపలకు నడిచాడు. నగ్నసత్యాన్ని గుర్తించిన ప్రజానీకం అంజలి నర్పించింది.

  

# ★ చిక్కుముడి

గుంటూరు అగ్రహారములోని మా మిత్రుల్లో యిప్ప
టికీ ఆ విషయం ఒక గొప్ప సమస్య. తేలికగా అర్థం చేసు
కుందామనుకున్న కొందరికిది చిక్కుముడై కూచుంది. శాస్త్రి
విషయాన్ని ఆమూలాగ్రంగా అర్థం చేసుకొన్న మామూలు
ఖాతాదార్లకూ ఆ సంఘటన విచిత్రంగా తోచింది. నేను
ప్రయత్నించాను చాలా బాధపడి; తొలిగా దాని అంతరా
ర్థాన్ని పరిశోధించిన పేరన్నా నాకు దక్కుతుందని. అందు
చేత వాడి ఆశయాలకు అనుగుణ్యంగా తాళం వేశాను. కాని
అంత మాత్రాన చిక్కిపోయే ఘటం కాదు వాడు.

కొత్తగా శాస్త్రికి కనుపించిన వాడల్లా, క్రాసువర్డ్
పజిలు వంటి దాన్లో రూపాయలు ప్రోగుచేసుకొన్నాడని శం
కించి వాడిచ్చే కాస్తంత కాఫీ తీర్థానికి జంకిపోలేదు. దూరంగా
పోతున్న వాడిని చప్పట్లుకొట్టి పిలిచి "కాఫీకి పోదాం రండి!"

అని పిలుచుక పోవడం ఓ విధంగా మామూలుగానే కను పించింది, ఋూ శేషను రోజుల్లో.

ఈకాఫీ పార్టీ వ్రేళ్లు పాతుకున్న స్నేహితుల నుంచీ ముఖపరిచయము గలవాళ్ళ వరకు వరుస తిరిగింది. అప్పుడు మాత్రమే వాడి వింత మనస్తత్వాన్ని గూర్చి ఆలోచించ టానికీ, సమస్య రూపంలోకి మారిన ఆ విషయపు గడ్డుతనాన్ని గూర్చి బుర్రలో మెదలడానికీ వీలుచిక్కింది. "ఈగోలంతా ఏమిటి? మతిపోయి మమ్మల్నంతా అతిథుల్ని చేస్తున్నావా?" అని ముఖాన అడిగిన వాడు ఒక్కడూ కనుపించలేదు. కొం టెగా తరుణోపాయం ఆలోచించుకొని ముఖాన్ని తప్పించ డము చాలామందికి అలవాటయింది.

శాస్త్రిని వీధిలో తెలిసిన వారెవరైనా చూస్తే దగ్గ రలో అందుబాటులోని గొందిలోకి నక్కేవారు. కనపడ్డవాడి నల్లా దగ్గిరకు పిలిచి భుజంమీద చెయ్యివేసి "కాఫీకి రమ్మని" పిలవడమే ఆ గడ్డు సమస్య, ప్రతివాడూ జంకాడు ఒకటి రెండు మార్లు చూశాక, శాస్త్రి చేసే దాన్లో ఏదో అంతరార్థం, స్వార్థం దాగివుంటుంది. కటకటలాడే కాలంతో నానా వాళ్ళను ఫలహారంతో గౌరవించేంతటి విశాలదృష్టి కానీ, ఆర్థిక బలంకానీ అతనికిలేదు. మరెందుకలా చేస్తున్నాడు?

తీరిగ్గా కాఫీహోటలు కంట్రాక్టు పాడి ఎవడి కెంత ఖర్చు చేసిందీ వ్రాసుకొని ఏ సంవత్సరానికో బాకీ కోసం వెంటపడతాడేమో? ననుకున్నారు కొందరు. ఎక్కువ డబ్బు బాకీకావలసి వివిధ వ్యక్తుల్లో కాఫీద్వారా అతని కోరకైన అభిమానాన్ని పూరిస్తున్నాడన్న ఊహకూడా కొందరిలో మెదలక పోలేదు. నన్నొకడడిగాడు, "ఏరా శాస్త్రిగారేమిటి వైజాగు పంపే అవసరం కలుగజేసుకొంటున్నాడా?" అతనెందు కలా అడుగుతున్నాడో తెలుసుకొని సమాధానం చెప్ప కుండా తప్పించుకొన్నాను.

మేమిద్దరము వెడుతుండగా పరధ్యానంగా నడుస్తూ సుబ్బారావు కనపించాడు. కనుచూపు మేరలో శాస్త్రిని చూచి ప్రక్కగొందికి తిరిగాడు. కాని శాస్త్రి అంతటితో వదల్లేదు. చప్పట్లుకొట్టి గబగబా వెళ్ళి రెక్క పట్టుకొని ఊగిస్తూ "రా రా కాఫీకి పోదాం మళ్ళీ వెళ్లువు కానిలే గాభరా పడతావెందుకు" అన్నాడు. సుబ్బారావు ముఖం వెల వెలా పోయింది. అర్థం కాకుండా చూచి మాట్లాడలేక నిలుచున్నాడు.

శాస్త్రి నన్ను కదిపి "చూశావ్ రా! నన్ను వీళ్లంతా దయ్యం పట్టిన వాడినిలా చూస్తారు, అసలు విషయం ఏమీ

లేదు. అయ్యోరుకు బ్రాకెటు ఆటకోసరం పెట్టిన పెట్టుబడి ఎన్నివందల కాఫీదానాలు చేసినా తీరలేదు. డబ్బు వచ్చే మార్గంలేక నేనిలా చేస్తున్నా, ఏక్షణంలో బోర్డు తిప్పుతాడో నని. మీారేమో భయపడి చస్తుంటిరి!" అన్నాడు, సుబ్బా రావు ముఖంలో రక్తం మళ్ళీ కదిలింది.

అయ్యోరు హోటల్లో దమాయించి కూచుని మూడు పెసరట్లు చెప్పాక "అదేమిట్రా... ఎంతమందిని యిరకా టంలో పెట్టావో చూడు..." అన్నాను. చిక్కుముడి విడి పోయినట్లుగా చూశాడు సుబ్బారావు. మరి సంగతి తెలి యని వాళ్లందరికీ యింకా గడ్డుసమస్యే యీవిషయం!

  

## ★ రేపనురోజుల్లో !!

క్రితంరోజు రికార్డు అట్టేవుంచడంవల్ల మేనేజరు చీవాట్లు వేసిన దగ్గరనుంచి తనయింటి గడప త్రొక్కిందాకా ఒకటే ఆలోచనై పోయింది రాజారావుకు. తనకు అన్నీ తెలుసు, ప్రపంచంలో జరిగేవన్నీ మనిషిలోని ప్రత్యేకతనూ, విజ్ఞానాన్ని ఆధారంగా తీసుకోవని. ఏదో బ్రహ్మాండమైన కారణంవుంటే మినహా వెంకట్రావువంటి దద్దమ్మ హెడ్ క్లర్కు ఐకూర్చున్నాడంటే అందులో అర్థం శూన్యం. వాడు మానేజరును బుట్టలో వేసుకోవడం మరి పదిరోజులకల్లా మేనేజరు వ్రాతకు బదులుగా వెంకట్రావుకు ప్రమోషను రావడం యదార్థమైనా ప్రజానీకం గుర్తింపదామె.

రాజారావు మనసు భిన్న దృక్పథాల్లో న చ్చుక పోయింది. వీధిదాటుతే మానేజరుచేతా, గడప త్రొక్కుతే పెండ్లాం చేతా. ఒక్కొక్కప్పుడు తనలా ఆలోచించుకుం

టూంటే తను చిన్నప్పుడు "రియాలిటీ" కొరకు, దాన్ని జీర్ణించుకోడానికీ పడ్డ అవస్థలూ; చదివిన పుస్తకాలూ గుర్తొచ్చాయి. తనను కొన్నన్నేళ్ల వ్యక్తియొక్క దేహపుష్టికీ, పలుకుబడికీ లోబడే రోజులేకాని, బుర్రవున్న వాళ్ళకు గిరాకిలేదు. రాజారావు పగటి కలలు కంటున్నా కోరికకూ, తాహతుకూ వున్న ఎడం ఆ గాథం అని తెలుసుకొనే, తన విజ్ఞానానికీ సమర్థతకూ ప్రక్కగా అంటుకొని నడిచే ఊహాలకే ప్రాధాన్యత నిచ్చేవాడు. తను ఎన్నో వ్యూహాచిత్రాలు నిర్మించి, సంతోషంగా పెండ్లి చేసుకొన్న ఆ అమ్మాయి, ప్రతిదాని విరుద్ధంగా మాట్లాడు తున్నప్పుడు తనెలా అనందాన్ని పొందగలడు? తన భార్య జ్యోతి— పేరుకుతగ్గ ఆశయంతో తనకు వెలుగును చూపించకపోగా, అంధకారానికి దారి తీస్తున్నప్పుడు చలనచిత్రాన్ని చూసి ఆ దర్శ దాంపత్యాన్ని, వ్యూహించే పద్ధతిలో రాజారావు ఆలోచనలు మరీ విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఏమో? మేనేజరును చూడాల్సినప్పుడూ, పెళ్లాన్ని భోజనం వడ్డించమని అడిగేటప్పుడూ అతను భయంతో కంపించేవాడు. తనవంటి కూపస్థ మండూకాని కిక బయటి గడపదాటి ఆఫీసుచేరే మధ్యనే ఏ కొద్దిఐనా మన శ్శాంతి వుంటే! చిన్నప్పుడు బి. ఎ. చదివేప్పుడు ఆదర్శ దాం

పత్యంమీాద తాను ధంచిన లెక్చర్లు గుర్తు తెచ్చుకొని, తననిత్య కవితాన్ని పోల్చుకుంటూ సిగ్గుపడేవాడు.

మేనేజరు అన్నమాటలు అతనికి ములుకుల్లా గుచ్చు కున్నాయి. ఇహా పెండ్లాం వాయిలు చీరె తేలేదని ఎన్ని రివాట్లు, వేస్తుందో? తనెందుకో అందరూ హీనంగా చూ స్తారు, చూసగించడానికి ప్రియత్నిస్తారు. నాముఖవర్చస్సే యితరులనలా ప్రోత్సహిస్తుందేమో? ననుకున్నాడు. రాజా రావు అడుగుల్లో అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు. తనభార్య జ్యోతి కనుక వెళ్లేప్పటికి పనిలో కనుకవుంటే ఒక అరగంటైనా ప్రశాంతంగా గడుపగలడు. ఆలోచిస్తూనే రాజా రావు యిల్లుచేరాడు. గడియ వేసింది. లోపల రెండు పిలు పుల తర్వాత ఆమెవచ్చి వాకిలి తెరిచింది. రాజారావు లోప లకు పోతున్నా ఏమిమాట్లాడలేదు.

అతను గుడ్డలు మార్చుకున్నాడు— అంతసేపూ చుర చుర చూస్తూనేవుంది. రాజారావు ఒక్కమారు ఆమెవంక చూసి మళ్లీ తల త్రిప్పుకున్నాడు.

"వేళకు తయూరౌతారు!" ఆమె మొదట అందు కుంది, "యీపూటకు యింట్లో గింజలులేవు, రేపను పాపుకు

శెలవు. ఎలాగో బజారుకెళ్లి ప్రియత్నించండి." ఆమాటతో రాజారావు గుండె జారిపోయింది. రేషన్ షాపుకు శెలవు,... తనుమాత్రం బియ్యం తేవాలి— ఏం ఒకరోజు ముందుగా చెప్పరాదూ? ఐపోయిన తర్వాతనా చెప్పాల్సింది? కాదు— కూడదంటే— పోట్లాట వేసుకొని తనింటికి వెళ్ళిపోతానంటుంది...

"ఇదిగో సరిగ్గా యిప్పుడే చెప్పకపోతే?... రాజారావు ఎలాగైనా లాలనగా నచ్చ చెప్పాలను కున్నాడు.

"ఒక్కరోజు ముందుగా చెప్పకూడదూ జ్యోతీ?"

"సరేలెండి; మాటలకు మాత్రం వున్నారు" అంటూ సంచీ నాలుగు రూపాయలు అక్కడేవుంచి మూతివిరచి వెళ్ళిపోయింది ఆమె. రాజారావుకు మరేమీ తోచలేదు; సంచి తీసుకొని, డబ్బు జేబులో వేసుకుని వీధివెంట పడ్డాడు.

  

సరిగ్గా సాయంత్రం ఆరున్నరదాకా తిరిగాడు రాజారావు. ఎక్కడా ఎవ్వరూ ఎక్కువ ధరకైనా బియ్యం యిచ్చేట్టు లేదు. బ్లాకు మార్కెటులో ఏదైనా కొంటానికి కూడా

క్వాలిఫి కేషన్లు కావాలేమో? అతను పోసురోడ్డుగుండా నడుస్తున్నాడు. ఎలాగైనా బియ్యం మాత్రం సాధించి తీసుక వెళ్లాలి, అప్పుడుగాని తను ఆవిషయంలో పడ్డకష్టాలన్నీ భార్యతో ఏకరువు పెట్టడానికి అవకాశంవుండదు. బియ్యం కొని యింటికి పట్టుకెళ్లకపోతే మరునాడు పస్తువుండాల్సిందే. కష్టనిష్ఠూరాల ననుసరించి అప్పోసప్పో తీసుకొచ్చి సర్దుకపోదా రకంకాదు పెళ్లాముఐనా.





''అమ్మయ్యా రైలువచ్చింది. ఎక్కండి, ఎక్కండి.''



రాజారావుకు ఆవీధిన వెళ్లుతుంటే ఎవరో కనుపించారు. అతనంతట అతనే అదీయిదీ అడిగి బియ్యానికేనా

అవస్థ అన్నట్లుచూసి, తనతోరమ్మని సౌజ్ఞంచేశాడు. తనింట్లో మంచి బియ్యం వున్నాయనీ, రాజారావుస్థితి తనకెంతో జాలి కలిగించడంవల్ల బియ్యం కంట్రోలు ధరకే యిచ్చి సహాయం చేయాలనుకున్నాననీ చెప్పాడు.

రాజారావు సంతోషంతో "కృతజ్ఞత" అన్నాడు.

"మరేం ఫరవాలేదులెండి" ఆకొత్త అతను అన్నాడు చురుగ్గా.

"మావాళ్లు బయట వున్నారు, మాబంధువుల యింటికి వెళ్ళి భోజనంచేసి మళ్లీ యీ వెల్కం హోటలు దగ్గరకే వస్తాను, మీరు వెళ్లిరండి."

రాజారావు మళ్లీ కొంచెం చికాకు పడ్డాడు. అతనేదైనా అశ్రద్ధతో మళ్లీ వస్తాడో రాడోఅని, తనయింటికి వెళ్లి యిద్దరూ భోజనం చేద్దాం రమ్మని కోరాడు ఆకొత్త మనిషిని అతనూ మొదట కొంచెం బెట్టుసరిచేసినా తర్వాత వప్పుకున్నాడు.

ఇంటికి వెళ్ళాక భార్యను పరిక్కాకు పిల్చి విషయా న్నంతా చెప్పాడు. ఆమెకూడా సంతోషించింది, ఒకపూట

భోజనం పెట్టినా కంట్రోలు ధరకే బియ్యం వస్తున్నాయని కొంచెం ఆలోచించి ఆమె తన అంగీకారాన్ని తెలిపింది జ్యోతి. ఆపూట మాత్రం జ్యోతి లేని సంతోషాన్ని తెచ్చుకుంది. నెయ్యీ, కూరా మరీ మరీ అడిగి వడ్డించింది. మానేజరు చేత ఎన్ని చీవాట్లుతిన్నా యింట్లోనైనా ఆమె మంచిగా అలావుంటే తానెంతో అదృష్టవంతుడు అనుకున్నాడు.

భోంచేశాక యిద్దరూ మళ్ళీ బయలుదేరారు. రాజారావు వెళ్ళుతూ బియ్యం దొరుకుతాయని ఆనందిస్తున్నా, ఆకొత్త తనికి అతనెందుకు సంతోషపడుతున్నాడో అర్థం కాలేదు ఇద్దరూ కొంతదూరం నడిచారు. అతను ఒకచోట రాజారావును ఆపి, "అప్రక్క సందులోనే మాయిల్లు ఒకమారువెళ్ళి మా ఆవిడ వుందో, స్నానానికి చెరువుకి వెళ్ళిందో చూసివస్తాను. ఇక్కడే వుండండి!" అనిచెప్పి వెళ్ళాడు. రాజారావుకూడా మరేమీ మాట్లాడలేదు. వెళ్ళి త్వరగా రమ్మని మాత్రం కోరాడు.

రాజారావుకు సిగ్గువేసింది. రాత్రి ఎనిమిదిన్నర వరకు ఎదురుచూసినా అతను రాలేదు. ఎవడో కంతిరి వెధవ అన్న నిర్ధారణకువచ్చి వాడు చేసిన దానివల్ల తనకేమీ నష్టంలేదు

కాని రేపను రోజుల్లో ఒకపూటతిండి!... అనుకున్నాడు రాజారావు ఏదేలాగున్నా తను బియ్యం లేకుండా యింటిగడప త్రొక్కాడంటే జ్యోతి కారాలు... మిరియాలు నూరుతుంది. అంతనమ్మకంగా చెప్పినతను వూరికేపోతే తన తెలివి తక్కువ తనం బయటపడుతుంది. జ్యోతి గంటక్రితం బియ్యం వస్తా యన్న సంతోషంలో చూపిన మర్యాద, యికముందు పర్యవ సానంగా వేయబోయే చీవాట్లు యొక్క నిష్పత్తి అర్థంకాలేదు. మరుదినం పదిగంటలవరకూ మేనేజరు గండం తప్పినా ఆపూట యింటికి వెళ్ళాక పెళ్లాం గండం తప్పదు.

గాలికి వూగే కాళీసంచితో వెళ్లాడు రాజారావు.

నడిరోడ్డుమీది బ్లూలైటు వెక్కిరించినట్లు చూసింది, రాజారావును.

  

# ★ అనుభవం

ఒకరోజు ఆ తెలియని ప్రాగ్‌లో అలాంటి చిక్కున పడ్డాను. ఆ దేవిషయం స్మరణకు వచ్చి యీనాటికీ నేను ఆశ్చర్యపడుతున్నాను. తెలియని పరాయి గ్రామంలో అవమానం జరిగింది. అదే మరోక విధంగా అనాలంటే ఎవరో జేబులోపర్సు లాగేశారు. నాకు ఏమిచేయడానికీ కాళ్ళాడలేదు. పైనతలా క్రిందకాళ్ళు మాడుతున్నాయి. ఆకలితో కడుపు మాడిపోతున్నది. జేబులో చివరకు చిల్లికాని ఐనా మిగలలేదు. బాకీలడగడానికైనా ఆవూళ్లో నాకు తెలిసినవాళ్ళు లేరు.

పరధ్యానంగా చూస్తూ ఒకచోట నిలుచున్నాను. రైలు దిగిన ప్రయాణీకులలో ఎవరో ఒకతను నన్ను సమీపించి, 'భోజన హోటలు ఎక్కడో చూపుతారా?' అన్నాడు. ఈ

మాట వినంగానే నాకేదో ఆలోచన స్ఫురించింది. చట్టున నవ్వు ముఖం పెట్టుకొని, "ఆ! నాకు తెలిసిన హోటలు మంచిది వున్నది రండి!" అన్నాను అతనివంక చూసి, "భోజనం మటుకు మనిషికి ముప్పావలా తీసుకుంటారు. ఇక్కడ అన్నీ ప్రియం."

"మంచి భోజనమైతే డబ్బుకేమిటి?" అన్నాడతను.

అతనితోపాటు మరినలుగురున్నారు. మేము ఆరుగురమూ ఒక హోటలులోకి వెళ్లాము. లోపలకు నేనువెళ్ళి ఆ బస ఆవిడతో ఆరుగురికి భోజనం వడ్డించమని చెప్పాను. బయటకు వచ్చి అతన్ని సమీపించి, "కూర్చోండి వడ్డిస్తున్నారు. మీ డబ్బిస్తారా! పాపం ఆవిడ ఎవరికో త్వరగా బాకీయివ్వాలట" అన్నాను. అతను మెదలకుండా, మూడుమ్ముప్పావలా నాచేతిలోపెట్టి, "దానికేమి లేండి. యివ్వండి." అన్నాడు. లోనికి వెళ్లి బేరంచేసి, మనిషికి అర్ధరూపాయి చొప్పున, నాతోకలిపి మూడు రూపాయలూ ఆమెచేతిలో పెట్టాను.

కబుర్లు చెబుతూ భోజనాలు చేశాము. అంతా అయాక అతను రెండుమార్లు త్రేపి, "భోజనం బాగానే వుంది.

వస్తాంసార్," అని మిగతావాండ్లతో వెళ్లిపోయాడు. చావు తప్పి కన్నులొట్ట పోయినట్లు, మరునిముషంలోనే మిగిలిన ముప్పావలాలో టిక్కెట్టుకొని మావూరుచేరాను. ఆత్మాభిమానంతో కృషించిపోయేకన్నా ఆలోచనే నాకు అక్కరకొచ్చింది.

  

# ★ మళ్లీ మొలత

అతని జీవితం ఒక సముద్రం. చేసే వుద్యోగం అందు లోని ఒక సుడిగుండం. ఇదే గోపాలాన్ని అనేక సందిగ్ధ సమయాల్లో వూపి చూసింది. అంతకాలం జరిగాక గోపాలం రేషనింగు షాపులో బియ్యం కొలిచేందుకు కుదిరాడని నా తోటివాళ్లకు కొందరికైనా తెలుసు. అదే అతనిలో అంత మార్పు తేవటానికీ విచిత్రమైన సంఘటనలను ఎదుర్కోవ డానికీ కారణమైంది. కానీ గోపాలాన్ని వెన్నంటిన సమస్య అంత సులభంగా విరగడై పోయేప్పటికి మనస్సుకు శాంతి చిక్కింది.

గోపాలానికి బియ్యంకొలత వుద్యోగంలో చేరాక. తన నియమిత జీవితంలో యిహ సాధించ వలసిందేమి లేనట్లు తోచింది. నవ్వుతూ యిల్లుకదిలి. పరిహాసాలతో రేషన్ షాపు వదిలేవాడు.

ఒకప్పటి గోపాలాన్ని అందరూ ఎరుగుదురు. వింతగా చూస్తూ, కడుపునిండని బాధతో లొట్టలు వేస్తూ వీధులవెంట తిరిగాడు. కడుపు కాలి... ఆకలి మంటల్లో ప్రపంచాన్ని దోచడానికి నాయకత్వం వహిస్తానన్నాడు. అంతస్థులు లేపిన ధనికులంతా, పగలు దోచేదొంగలు, కడుపుకక్కుర్తి కోసం చేస్తున్న విషయం గ్రహించలేరని అతని ఆశయం, అలాంటి— గోపాలం——

అతనికి ఆ రోజుల్లో దిగులులేదు. అతని పని తనకు యిచ్చిన బస్తాలు రాసులుగా దొర్లించి చీట్లప్రకారం బియ్యం కొలవడం. పగటి గారడీలా గోపాలం కొలతలో మానిక గింజలమీద, మరోమానెడు నిలిచినట్లుండేవి. కాని అంతా పూర్తయాక లెఖ్ఖ వప్పగించడం. పెచ్చుధాన్యం ప్రక్క జేబులోని గుడ్డ సంచిలోకి నింపడం గోపాలం చివరిపని. ఈ కనికట్టు యజమానికీ, మరే జంట కళ్ళకూ తెలియదు.

అతని ప్రతిభ సాగింది. నెల తిరిగేప్పటికి వేలబస్తాలు దొర్లుతున్నాయి. గోపాలం చేతిసంచి వెడల్పై, ముడుచు కుంటూవుంది.

అనుమానంతోనో, ఆశతోనో రేషన్ కొలత తిరుగ కొలిచిన ఘటికులున్నారు. చాలమంది ఆ సమస్య సాగతీసి ఆలోచించి అర్థం చేసుకున్నారు. కొట్లో కొలిచిన మానెడు గింజల్లో, యింటికి వచ్చేప్పటికి గిద్దెడు షుమారు గాలి తినేస్తున్న దేమోనని?

తెలిసిన వాళ్ళెవరూ అడుగలేదు. రేషన్ బియ్యం లోనూ కొత్తపద్ధతి. ధైర్యాన్ని చిక్కబట్టి నిజం బయటికి నెట్టితే— గోపాలం కోపానికి ఆహుతైతే వేళతప్పి పస్తులు కాయాల్సి వస్తుంది.

  

ఆ విషయం, తర్వాత మరోవిషయం అందరికీ తెలిసింది. గోపాలానికి ఎక్కువైన బియ్యం బ్లాకులో అమ్ముతున్నాట్ట.

ఒకరోజు పడమటి బజారు కూలీ వచ్చి, "ఈ విషయం విన్నారా!"... అన్నాడు గోపాలం యజమానితో.

"అదేమిటి?" అన్నాడు అతను విస్మయపడి, అంత గమ్మత్తుగా వచ్చిన మనిషిని చూసి.

ఆ కూలీ మీసం దువ్వుకొని పెద్దగా నవ్వాడు, "మీ గోపాలం చూశారా ఎంతపని చేస్తున్నాడో? దొంగ కొలతలో మిగిలిన బియ్యం కొంప జరుపుకుంటూ బ్లాకు చేస్తున్నాడు!"

"నిజంగానా?" అన్నాడు షావుకారు యదార్థంగా కొంచెం చకితుడై.

కూలీ పోతూ పోతూ వింతగా చూశాడు, "దినగం పంతో బ్రతికే వాడికి పరాచకాలుంటాయా బాబూ?"

యజమాని సాయంత్రం గోపాలాన్ని పిల్చి సంగతి చెప్పి "నిజమేనా?" అన్నాడు.

"నిజంగానే," అని చెప్పాడు గోపాలం ఆలోచించకుండా. చేసిన పనికన్నా, అనుకోని రకంగా వచ్చిన సమాధానం చూసి విస్తుపోయాడు షావుకారు.

"ఐతే దొంగకొలతేనా? నన్ను కూడా మోసం చేస్తున్నావా?"

"కొలత దొంగకొలతే, కానీ..."

"కానీ..." గట్టిగా అడిగాడు షావుకారు.

"నేను అన్యాయంగా కొలిచేది— బీదలమీద మేడలు కట్టిన వాళ్ళకు కొలిచేప్పుడు మాత్రమే!"

అంతా విని వూపిరి బిగపట్టి "యదార్థంగా నా?" అన్నాడు షావుకారు ఆలోచించి, "అట్లాఐతే ధనికులంటే నీ కళ్ళకు చీడపురుగులన్న మాట!"

"అవును యదార్థం...కాదు కాదు..." గోపాలం నాలిక్కొరుక్కున్నాడు.

యజమాని చుట్టపీక చివరిమూరు గట్టిగా పీల్చి పారేసి, "రేపు వుదయం వచ్చి రావల్సినమటుకు డబ్బు పట్టుకెళ్ళు!" అన్నాడు.

గోపాలం ఆవేళ పనికాకముందే రోడ్డునపడి వెళ్ళాడు. రెండుసార్లు తిరిగిచూశాడు... షావుకారు కోరగా, కోపంగా చూస్తున్నాడు. మళ్ళీ గోపాలం జీవితంలో మెలత బయలుదేరింది!!

  

# ★ స్వార్థపు కోణంలో

'సుబ్బారావుకు యిబ్రహీం ఒక మాదిరి పరిచయస్థుడు. ఆపరిచయమే కొన్నాళ్లకు లౌకికమైన స్నేహంగా మారింది. సినిమాలు చూసినా కాఫీ త్రాగినా రోజూ కలుసుకునే అనేక మందిలోకే లెఖ్ఖ వేసుకున్నాడు గాని, యిబ్రహీంకు తన దృష్టిలో ప్రత్యేకత నేమీ యివ్వలేదు సుబ్బారావు. కాని అతని వెంట తిరిగే పిపీలకాలు తననుకున్నంత తేలికగా వదలలేదు. బజారున కనుపించినప్పుడల్లా మిత్రులు సుబ్బారావు చుట్టూచేరి యిబ్రహీంను పరిచయం చేసుకొని రేషనింగుకు సంబంధించిన చిల్లర పనులు చేయించుకునేందుకు ఎత్తులు వేసేవారు.

ఆసాయంత్రం సుబ్బారావు నరశింహం భుజాన చెయ్యివేసి నరసింహారావు పేటకు నడిపిస్తున్నాడు. ఇంతలోకే ఏ మూలనుంచో వచ్చిపడ్డాడు యిబ్రహీం. అతను రేషనింగు

గుమాస్తా అని నరశింహానికి తెలియదు. సుబ్బారావు స్నేహితులను ఒకరి కొకరికి పరిచయం చేశాడు. ముగ్గురూ కలిసి కబుర్లు చెప్పుకుంటూ నరశింహం యింటికి వెళ్ళారు.

టిన్నులోని సిగరెట్లు పలచబడేకొద్దీ ముగ్గురి సంభాషణ చురుగ్గా సాగిపోతున్నది. ప్రభుత్వపు పరిపాలననుంచి, పాలమనిషి చరిత్రవరకూ సాగివచ్చింది చర్చ. ఉన్నట్లుండి,

"ఈ మంత్రుల పని అత్తగారింటి అల్లుళ్ళకన్నా హాయిగావుంది!" అన్నాడు యిబ్రహీం.

సమయాన్ని విడువలేదు, "వికాకుమటుకేం. శేషనింగు వాళ్ళపని యింకా హాయిగా వుంది," నవ్వుతూ చెప్పి పొడిచాడు నరశింహం.

"అదేంకాదు," యిబ్రహీం కొంచెం తడువుకొని అన్నాడు, "మా ఆఫీసురు ఛండప్రచండుడు. లంచం అన్నమాట వినపడకూడదు. లంచం యిచ్చే లక్షణాలు కనుపించే మనుష్యుల్ని ముందు పని పడతాడు."

"కాంతే కనుపించేట్లూ, వినిపించేట్లూ లంచాలు తీసుకునే దద్దమ్మలు కూడ వున్నారన్నమాట మీ ఆఫీసులో?" పక పకా నవ్వాడు సుబ్బారావు.

"వున్నారనికాదు"...

"మరి?" నిల్వాదీసి అడిగాడు.

"మీారనుకొన్నంత తేలిక కాదని నాభావం" అడిగాడు యిబ్రహీం.

"ఇంతకీ నువ్వొదిలి పెడతావా— అని, లంచం యిచ్చే వాళ్లుంటె?"

యిబ్రహీం ఒక్క క్షణంపాటు ఏమీా మాట్లాడలేదు. ఏదో గుర్తొచ్చిన వాడికి మల్లె తల ఎగురవేసి, "ఒక మంచి ఉపాయం తోచింది. చేస్తావా?" అన్నాడు నరశింహం యిబ్రహీం వంకచూసి.

"ఏమిటది?"

"ఏరా మీాయింటి యజమాని శెట్టికి తగిలిద్దామా?" అని, సుబ్బారావు సమాధానానికి ఎదురు చూడకుండానే, "సుబ్బారావు మేడమీాద ప్రక్క గదిలో వడ్ల బస్తాలున్నాయి మరి!" అన్నాడు యిబ్రహీం కళ్లలోకి చూస్తూ.

" నిజంగానా? "

"ఇహ అబద్ధం కూడానా," నరశింహం వుత్సుక డయ్యాడు, "ఇదొక లేకాదు. కావలిస్తే దొంగబియ్యం తినే బడా బహాదూరులను ఎంత మందినైనా పట్టిస్తా."

"సెభాష్" యిబ్రహీం నరశింహం యిచ్చిన విన యాలకు వుప్పొంగి పోయాడు. కాని యీ సంభాషణ సుబ్బా రావుకు బాధను కలిగించింది. సుబ్బారావు మనస్తత్వాలను పరిశీలించడంలో, మనుష్యులను అర్థం చేసుకోవడంలో మేటి చెయి. అందుచేత నరశింహం ధోరణిని అసహ్యించు కున్నాడు. అతను తన అనుమతైనా లేకుండా తను అద్దెకున్న యింటివాళ్ళ తప్పుల్ని వేలుపెట్టి ఎందుకు చూపాడో తనకు తెలుసు. కొత్తగా యిబ్రహీంతో పరిచయం చేసుకున్న నరశింహం అతని అభిమానాన్ని చూరగొనేందుకు, తన పరిచయాన్ని బలపరచుకునేందుకు యీవిధమైన సంభాషణలోకి దిగాడు. తనేదో లోకాన్ని వుద్ధరిస్తున్నట్లుగా దొంగ తిండితినే వాళ్లను పట్టిస్తానన్నాడు. నరశింహం స్వభావం యింకా ఒక నిశ్చిత స్థానానికి రాలేదు; ఒక స్పష్టమైన ఆకారాన్ని ఏర్పరచు కోలేదు. అందుచేత తను కొత్తవ్యక్తిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించకుండానే, అవతలి వాని స్వార్థపు కోణంలో

తను లోకాన్ని చూశాడు. సుబ్బారావు కంపించిపోయాడు యీ వ్యూహాలతో.

ఇబ్రహీం చేతినిగుంజి, "ఏమోయ్ నిజమేనా? మీ శెట్టి వస్తు దాచివుంచింది," అనడిగాడు సుబ్బారావును.

"ఔను!" అన్నాడు సుబ్బారావు అబద్ధమాడలేక.

"ఔనేమిట్రా క్రౌను. ఏదో ప్లాను ఆలోచించు శెట్టిని ఏడిపించడానికి...?" నరశింహం అందుకున్నాడు.

ఈమారు నవ్వొచ్చింది సుబ్బారావుకు నరశింహం వైఖరిచూసి. పైగా తనకొక మంచివ్యూహ తట్టింది. శెట్టి చాలా పిసినిగొట్టువాడు. పైపెచ్చు యిరవై రూపాయల అద్దె గుంజుతూ తనకేమీ సౌకర్యాలు చేయడం లేదు. అట్లాంటప్పుడు యీ అవకాశాన్ని వినియోగించుకొని, అతన్నెందుకు కవ్వించ గూడదు? ఐనా మనిషికి ఖంగారెత్తించడమే కాని, డబ్బు గుంజడం వుద్దేశ్యం కాదాయె.

"సరే! ఇకేం నరశింహం నేనూ మాగదిలో వుంటాం," సుబ్బారావు తన వుపాయాన్ని విస్తరించాడు యిబ్రహీంకు, "నీవు పొద్దున్నే వచ్చి శెట్టిని పిలిచి ధబాయించడం

మొదలుపెట్టు. నీగొంతు వినగానే నరశింహాన్ని పంపిస్తాను మధ్యవర్తిగా, ఆతర్వాత కథ నూ బంగారు తెరమీద చూస్తువుకాని."

"భలేగుందిరా!" నరశింహం చప్పట్లు చరిచాడు, "ఇంతకూ శెట్టికి యిబ్రహీం మన స్నేహితుడని తెలియదుగదా?"

"తెలియదు."

సరేనంటే సరే ననుకొని ఎటువాళ్ళటు వెళ్ళిపోయారు.

  

సుబ్బారావు లేనప్పుడు చూసి యిబ్రహీం శెట్టి యింటికి ఎందుకు వచ్చాడో తెలియదు. శీతారామయ్య శెట్టి మేడ మీద సుబ్బారావు అద్దెకున్నాడు. క్రింద శెట్టి దుకాణం పెట్టుకున్నాడు. శెట్టిని చూడడంతోనే యిబ్రహీం చకచకా కొట్లోకి వెళ్లాడు.

"మీయింట్లో దొంగ బియ్యం వున్నాయట?"

శెట్టి యీధోరణిని వెంటనే పసిగట్టాడు.

"చూడండి బాబూ!" ప్రక్కనే చాటలో వుంచిన

బియ్యాన్ని తీశాడు, "యివిగో... యివి పత్యానికని తెచ్చు కున్నాము."

"అవికాదు. బస్తాలు బస్తాలే వున్నాయట," పోలీసు వాని కఠోర స్వరాన్ని అడ్డెకు తెచ్చుకున్నాడు.

శెట్టి నిరుత్తరుడయాడు. తను బియ్యం దాచిన ఆచోకీ ఎవరో వివరంగా చెప్పివుంటారు. ఐనా ధైర్యంగానే, "ఇంకేమీలెవ్వు. యిల్లంతా సోదాచెయ్యండి," అన్నాడు.

"ఇంట్లోకాదు. మేడమీదనో?" పరిశోధకు నిలా కళ్ళను తిప్పాడు, రేషనింగు యిబ్రహీం.

"మేడా... మేడ అద్దెకిచ్చాను."

"ఎవరికి?" సూటి ప్రశ్న.

"సుబ్బారావు గారికి. సహకార శాఖలో పరిశీల కులుగా వున్నారు."

"ఔను! ఆయన నాకూ తెలుసు. మేడమీద మీ భాగంలో బస్తాలున్నాయి కదూ?"

"... ...?"

"సరే ముందు మేడమీదకు నడవండి."

మేడమీద వరుసగా పేర్చిన బస్తాలను చూపుతూ, "ఇన్ని బస్తాల వడ్లుంచుకునే గట్టి అబద్ధ మాడారుకదూ?"

"ఔను?" శెట్టి తొణకలేదు.

"ఎందుకు ఆడారు?"

"ఎందుకా?... కడుపుకోసం కల్లలాడాను. లోకంలో జరుగుతూన్న సంఘర్షణ అంతా యీ జానెడు పొట్ట కోసరమే!"

"చాలు. మీ వేదాంతం కట్టిపెట్టి ముందు ఆఫీసుకు నడవండి!"

"అమ్మోయ్?" అని అరిచాడు.

శెట్టి గ్రుడ్లల్లో నీళ్లు తిరిగాయి. తనతల్లీ పిల్లవాడూ వచ్చి ప్రక్కన నిలుచున్నారు కళ్లనీళ్లు కార్చుతూ...

శెట్టి జేబులోని రూపాయి నోట్లు తీశాడు, "ఇదిగో యీ నాలుగు రూపాయలూ కాఫీకి తీసుకొని, యీ ముసలి

తల్లికోసరం, అభం శుభం తెలియని నా పసికందు కోసర మన్నా వొదిలెయ్యండి.'' సామోపాయం ప్రదర్శించాడు.

ఇబ్రహీం వుగ్రుడైనట్లు నటించాడు, "నాలుగూ రెండూ తీసుకునేందుకు నేనేం భిక్షుకుణ్ని కాదు. పదండి ప్రిభుత్వమే మీ మొర వింటుంది.''

శెట్టి లోకజ్ఞానం తెలిసిన సంస్కారి. సమయాన్ని వదలకుండానే అవతలి వ్యక్తి భావాన్ని అర్థంచేసుకొని,

"ప్రిభుత్వం అంటే ఎవరు బాబూ. లోకాన్ని దోచుకునే వుద్యోగులందరిని జమ కడితేనే ప్రభుత్వ యంత్ర మౌతుంది. ప్రభుత్వం పేరిట జరుగుతూన్న అన్యాయాలూ, అరాచకాలూ, వాస్తవిక రూపంలేని "ప్రభుత్వ" మనే పేరుకు చెందవు. సంస్థను మలిన పరచిన వ్యక్తులే అందుకు బాధ్యులు.

"ధర్మోపన్యాసాలతో కాలం వెళ్ళబుచ్చేట్లుగా వున్నారు.!'' ఘూటైన శీతారామయ్య మాటలకు యింతకన్నా ఎక్కువ మాట్లాడలేక పొయ్యాడు యిబ్రిహీం. శెట్టి విషయాన్నంతా తెలుసుకున్నాడు కనుక పదిహేను రూపాయలూ చేతులో పెట్టాడు, "ఇహ వెళ్ళండి, బాబూ। మీరెలానో సర్దుకోకపోతే మాలాంటి వాళ్ళ పనేం కావాలి''

చెయి చాచాడు—... ...డబ్బు అందుకునేప్పుడు యిబ్రహీం వణికి పోయ్యాడు. గుండె వేగంగా కొట్టుకుంది. అప్పటి అతని స్థితే లంచానికి మొదటిసారని చెప్పక చెప్తుంది.

ఇబ్రహీంకు తెలుసు శీతారామయ్య శెట్టి అసాధ్యుడని. అతనెంతోమంది ప్రభుత్వోద్యోగులను బేజారెత్తించాడు. ఇవన్నీ తెలిసికూడా పదిహేను రూపాయలూ తీసుకొని గమ్మున యింటి త్రోవ తీశాడు యిబ్రహీం.

  

సుబ్బారావు బజారునుండి వచ్చేప్పటికి ఆ శెట్టి తల్లి లబో దిబోమన్నది; ఏడుస్తూ, "మీరేమైనా ఆ చోకీ యిచ్చారో ఏమో... జరగాల్సినంత పనీ జరిగింది!"

సుబ్బారావుకు యిదేమీ అర్థం కాలేదు, "ఏం జరిగిందేమిటి?"

"ఇంకేముంది జరిగేది. నాకొంపకూలింది!"

సుబ్బారావు నిబ్బరంగా అడిగాడు, "తొందర పడకండి. అసలు సంగతేమిటో చెప్పండి అవ్వగారూ!"

రేసనింగాయన వచ్చి చెకింగు చేశాడు బాబూ!"

"హాఁస్...అంతేకద,"

"అంతటితో పోలేదు. వద్దు పట్టుకున్నాడు."

"ఆ... పట్టుకోని—"

అవ్వ దీర్ఘాలు తీసింది, "మావాడు ఎంత బ్రతిమాలినా వినిపించుకోలేదు. పదిహేను రూపాయలు తీసుకోంది కాని విడువలేదు."

"ఆ...డబ్బు తీసుకున్నాడా!?" సుబ్బారావు చకితుడయ్యాడు. అతనికి "డబ్బు" అన్న మాటతప్ప మరింకేదీ చెవి దూరలేదు. తనంత ఆశ్చర్య పడడంలో అవ్వ అనుమానపడుతుందని కూడా అనుకోలేదు.

"తీసుకున్నాడు బాబూ! మీతో అబద్ధం చెబుతానా!" అన్నది అవ్వ. సుబ్బారావు యిదంతా వినిపించుకోలేదు. గబగబా మేడ మీదకు వెళ్ళి సిగరెట్టు ముట్టించి ఆలోచిస్తూ పడుకున్నాడు.

తామనుకున్న ప్లానుమారి యిలాంటి సంఘటన, తనకు తెలియకుండా జరిగినందుకు ఎంతో నొచ్చుకున్నాడు సుబ్బా

గదిలో పడుకొని యిబ్రహీంకు ఆఫీసులో జరిగిన సంగతి నరశింహానికి విశదపరుస్తున్నాడు సుబ్బారావు. తలుపు త్రోసుకొని వచ్చాడు యిబ్రహీం.

"ఇద్దరికీ గుడ్‌మార్నింగ్ సార్!"

"రండి...రండి"— అన్నాడు నరశింహం. లేసి సుబ్బారావు ఏమీ అనలేదు. ఇబ్రహీం యిలా ప్రశయంలా విరుచుకు పడతాడని తనకు తెలియదు. తను కేసు పెట్టించాక ఉద్యోగం ఊడిన యిబ్రహీం సెల్యూటు వేసుకొని, త్రికాలల్సు పొగత్రాగుతూ వస్తాడని తను కలలోనైనా ఊహించలేదు. అందుచేత యిదంతా అయోమయంగా కనుపించింది.

"ఏమోయ్ నామీద నేరాలు వేశావట. ఐనా ప్రీతిలంగా నా ఉద్యోగం ఊడపెరికించాచావు." అన్నాడు యిబ్రహీం.

సుబ్బారావుకు సహనశక్తి నశించిపోయింది. "ఔను... నేను నీకు చెప్పిందీ, నువ్వు చేసిందీ ఏమిటోయ్?"

ఇబ్రహీం నవ్వాడు. చకితుడైపోతున్న సుబ్బారావును, అయోమయంలో పడ్డ నరశింహాన్ని చూసి యింకా పగలబడ్డాడు.

"నీగోడవేం అర్థం కావడంలేదు." ఆగపట్టుకోలేని సుబ్బారావు ప్రశ్న.

"అర్థమెలా ఔతుంది మరి?"

గాలి పీల్చకుండా స్తబ్ధులైపోయారు యిద్దరూను.

"ఇదంతా నా స్వార్థం కోసం చేసినపని" యిబ్రహీం మొదలు పెట్టాడు, "మీ శెట్టిని యీ పనికి కీలకంగా తీసుకున్నాను— అంతే!... ఐనా యింతకన్నా నేనేం చేయాలో నువ్వే చెప్పు. ఇంతకుముందు రెండుమార్లు రాజీనామా యిచ్చినా అంగీకరించలేదు. ఇష్టమొచ్చినప్పుడల్లా చేరి వెళ్ళిపోయేందుకు, యిదిక్లబ్బుకాదు." అన్నాడు ఆఫీసరు.

సుబ్బారావుకు యిదంతా గ్రీకు భాషలాగా వుంది. నరశింహం తలగోకుకున్నాడు. ఇబ్రహీం యిద్దరి ముఖాల వంకా చూశాడు.

"ఏమోయ్ యింకా అర్థం కాలేదా? మా మామయ్య ఫ్యాక్టరీ ప్రారంభించాడు. తన వాగ్దానం ప్రకారం, పావలా భాగానికి రమ్మని ఉత్తరాల వర్షం కురిపించాడు. మరి యీ ఆఫీసరు వదలందే!... అందుకని......?"

సుబ్బారావు ముఖంలో ఆశ్చర్యం, ఆనందం మిళితమై మెరుగుపూత పూసింది. నరశింహం ముక్కుమీద వేలు వేసుకున్నాడు.

"ఓరిమనిషీ... యిందుకేనటోయ్ యీ గొడవంతా. మాకు తెలియకుండాచేసి వేషం తెప్పించావ్?" నరశింహం భుజం పట్టుకు వూపుతూ అడిగాడు సుబ్బారావు.

"లేవండి మరి టీపార్టీకి!" నరశింహం నంతువచ్చింది.

"ఈ వేషమంతా అందుకేమరి...!" నరశింహం కిలకిలా నవ్వాడు.

  

# ★ తరుణోపాయం

"ఏమారు లక్ష చెప్పండి... ఇహ ఒక్క నిముషం కూడా యీ కాపురంతో వేగలేను!"

"అంటే?"

"అంటేలేదు. కొంటేలేదు. వచ్చిన జీతంలో యిష్టమైనంత తీసుకొని, మిగతాది నాముఖాన వేస్తే సంసారం ఎలా గడపాలనుకున్నారు?"

"పోనీ ఖర్చులు—"

"తగ్గించుకుంటే... అనబోతున్నారు. అంతేగా?"

"ఊఁ..."

"ఊహు!"

"ఏదీకాదంటే ఎలా? సమస్యను సృష్టించిన దానికి

"పోనీ యిద్దరు పిల్లలూ..."

"నువ్వు—నేనూ..."

"ఈరోజుల్లో—"

"ఈరోజుల్లో—"

"ఈ జీతంతో బ్రతకడం కష్టం— అంటావు అంతేనా?"

"కాకపోతే ఏమిటండీ?"

"పోతే ఏమిటో చెప్పు"

"మావాళ్లు భూసంస్కరణములు, పన్ను మూలుగుతున్నవి."

"అందుకని?"

"నేనూ పిల్లలూ పుట్టింటికి వెళ్లి గడ్డుదినాలు గడిపిందాకా—"

"రాణీగారు అసలు పెద్ద ఘటం విషయమే మరచారల్లే వుంది."

"కాదు మీ మేనమామగారు—"

"ఊహు... బాగానేవుంది.

నా పెళ్లాం పుట్టింటికి వెళ్ళిందని చెప్పుకోమంటూవా?..."

"కాదండీ పూర్తిగా వినరే?"

"ఊఁ. కానీ"

"మొదట నాలుగు రోజులు హోటల్లో తినండి. ఎలాగు మీ మేనమామగారికి తెలిస్తే కంఠం వుండగా

పిలవకపోడు. ఆయనకేం నెలకు ఆరువందల జీతం. భూములున్నాయి."

"అదీ ప్లానంటే. నువ్వు చెప్పేపద్ధతి ఏదైనా సరే, నా గౌరవానికి లోటు రాకుండా వుంటే?"

"కాదామరి. ఐనా వాళ్ళింట్లో మీకు స్వతంత్రం. నాలుగేండ్లయినా బాధ వుండదు."

"ఐతే ఎన్నాళ్ళదాకా యీ కార్యక్రమం"

"గడ్డుదినాలు గడిచిందాకాను."

"మరి రేషన్ కార్డో?"

"మీకంటే ముందే ఆలోచించాను. ప్రక్కింటావిడకు కూతురూ అల్లుడూ వచ్చారట. నెలకు ఐదురూపాయల చొప్పున అద్దె యిస్తానని కార్డు తీసుకుంది."

"సరిసరి బేరాలుకూడా మాట్లాడి వుంచావ్! ప్రయాణం ఎప్పుడు?"

"రాత్రి బండికి. రేపైతే వారం బియ్యం తెప్పించాలి!"

"భలే దానివి రత్నం. నావంటి మట్టి బుర్రకు నీవంటి భార్యే దొరకాలి."

"పోనిస్తురూ వేళాకోళం."

"ఎలా పోనిస్తాను. ఇలా దగ్గరకురా నీవని చెప్తాను."

  

# ★ బీరకాయపీచు

ఆరోజు మా ఆవిడా నేనూ రేషనింగు పద్ధతులను గూర్చి ఆలోచిస్తూ కూర్చున్నప్పుడు బీరకాయపీచు బంధువు లిద్దరు తటాలున తలుపు తెరచుకొని చెమటలు కక్కుతున్న శరీరాలతో లోనికి వచ్చారు. నాగుండె గుభేలు మంది. కడుపునిండా తిండిదొరికేందుకు సూత్రాలను ఆలోచించుకొని ప్రణాళికలను తయారు చేసుకుంటున్న మాకు యిది గోరు చుట్టుపై రోకలి పోటులాగ ఐంది. రేషనింగు బాధకు తోడు యీ బీరకాయపీచు చుట్టాలు శనిముఖం వేసుకుని దాపురించారని నాలో నేను విసుక్కున్నాను. కాని మర్యాదలో రాటు దేలిన నాలుక వూరుకోలేదు.

"ఎక్కడనుంచి రావటం..." అన్నా:

"శాంతపురంనుంచే!"

అంగులో వాళ్ళమీా తప్పటడుగు వెయ్యారు. నూ ఆవిడ ముఖం యీాదెబ్బతో పాలిపోయినా, స్త్రీ చాకచక్యాలను వినియోగించుకొని తాజాగానే మాట్లాడింది. పది నిము షాలయాక పైపంచ వేసుకొని నిశ్శబ్దంగా నేను వీధి టిక్కెట్టు తీసుకున్నాను. తద్వారా ఈభారం అంతా సతీమణి మీాదే పడి ఆమె బాధపడాలని కాదు. నేనువుండి సహాయ పడని దానికన్నా ముఖమెదుట లేకపోతే కొంత విసుగుదలైనా తగ్గుతుందని. నేను వెళ్ళి అయ్యారు హోటలులో బిచాణా వేశాను. "ఏమికావాలి సార్!" అని ఆ సర్వరు తయారవు తాడని విల్సుపెట్టెలోని పక్కను సిగరెట్టు వెలిగించి మరీ కూర్చున్నాను. నాజీవితాన్ని గూర్చి ఆలోచించుకుంటూంటే నాకే భయం వేస్తుంది. నావెధవ నౌకరీకి వచ్చే ఎనభై రూపాయలతో పదిమందికి కడుపునిండా [రేషనింగులో చాలనిబియ్యం చాటుగా] తిండి దొరకాలి. పిల్లలేమో నందు పోకుండా ఏడాదికొకరు నెంబరు వారీగా తయారవుతున్నారు.

కొలత బియ్యం దినాలలో మరీ బంధువులతో వ్యవ హారం చికాకున పడింది. ఆనాడు మాత్రం నిజంగా నేనను కున్నట్లే ఆవిడ చాలా శ్రమపడింది. మట్టాలు యింట్లో వచ్చి కూర్చున్నాను. వారం బియ్యంలో వాడితే రూపాయికి అరు

గిద్దలు చొప్పున దొరకడం కష్టసాధ్యం. ఒకవేళ కొన్నా నెలరోజుల శ్రమఫలితం సగంలోనే కాళీ ఔతుంది.

మాఆవిడ చాలా చురుకైన వ్యక్తి. సగర్వంతో నేనీ మాట చెప్పడంలేదు. ఇంటి వ్యవహారాలు చక్క పెట్టడంలో అలాంటి భార్యే కాని లభింపక పోయినట్లైతే నేనెంతో గృహబాధ పొంది వుండాల్సింది.

ముందు చుట్టాలకుకూడా మాసతీమణి వంటప్రయత్నం చేసింది. తర్వాత తాత్కాలికంగా ఒకచిన్న ఆలోచన వూహించింది. రోజులు సాఫీగా నడిచేందుకు ఏవ్యక్తీ అంత కన్నా తేలికైన త్రోవ తెలుసుకోలేడని నానమ్మకం. ఆమె బద్ధకంతో ఆచిన్నపని చేయకపోతే నేను నెలజీతము చాలక నానావాళ్లను యాచించి లేదనిపించుకొనే వాడిని.

ఆమెకా ఆలోచన తట్టగానే బియ్యం కొలిచి సంచిలో పోసి రాముతో ఏదోచెప్పి దొడ్డివాకిలిన వాడికిచ్చి పంపిం చింది. వాడు గిర్రున పదినిముషాలలో అటుతిరిగి వీధివాకిలి నుండా లోనికి వచ్చాడు. లోపలినుంచి వచ్చి తల్లి సంచి అందుకుంది.

"ఏరా రాముా! బియ్యం ఎలాకొలిచాడు. అబ్బబ్బ ఎంత పాడు బియ్యంరా!"

తరిఫీదు పొందిన రాము, తడుపుకోకుండా సమాధానం యిచ్చాడు, "ఆరుగిద్దలు కాడికి కొలిచాడే... ఆసాయిబు పెద్దవాడున్నాడు. బాకీపెట్టం, నిలుచున్నట్లుగా ఐదురూపాయలూ తెమ్మన్నాడు."

అవతల మంచంమీద చలివిడి ముద్దలా కూర్చున్న చుట్టాలవంక చూడకుండానే "అరే నాన్నగారు లేరుగా ఎట్లా?" అన్నది ఆమె.

"ఇప్పుడు యివ్వకపోతే మర్యాద దక్కదన్నాడే"

ఆమె కాస్సేపు ఆలోచించి తలెత్తి చూసింది. వాళ్ళు గ్గరూ యీగొడవ తమదాకా వచ్చేట్లుగా వుందని- వూహించకునే పరిశోధకుల మాదిరి మేఘాల వంక చూస్తూ కూర్చున్నారు.

"సరే!" అంది నాభార్య "ఐతే బాబాయ్! వారు వీధిలోకి వెళ్ళారు. ఐదురూపాయలున్నాయా?"

అందులో ఒకతను తోణకలేదు. రెండో అతను [మూా

ఆవిడకు బాబాయి వరుస] మాత్రం అభిమానానికి కట్టుబడి, నోటుతీసి అందించాడు. అప్పుడు అతని చేతులు గజగజా వణకణం స్పష్టంగా చూశానని తరువాత కిట్టు అన్నాడు.

నేను రాకముందే భోంచేసేందుకు వాళ్ళు సంశయించారు. కాని ఏమధ్యాహ్నానికో యింటికి వచ్చే నాస్వభావాన్ని వల్లించాక ఆకలి కడుపులను చల్లబరచుకునేందుకు పట్టుబట్టలు కట్టుకున్నారు.





''రైలు వస్తున్నది. వరుసగా నిలుచోండి, స్థలం దొరకదేమో!''



మధ్యాహ్నానికి నేను యింటికి తయారయ్యాను. బీర

గాయపీచు చుట్టాలు సంచులు సర్దుకొని ప్రయాణానికి సిద్ధమయ్యారు "అప్పుడే వెళ్ళుతున్నారా?..." అన్నాను నేను.

మా సవ్వడి విని మాఆవిడ వచ్చింది, "ఒక్కపూటన్నా వుండకుండానే...". బాగానే బుద్ధివచ్చింది యీ ఒక్కపూటలోనే... అన్న భావం వాళ్ళముఖాల్లో వ్యక్తమైంది మెల్లిగా సన్నగా "ఆ వెళ్ళాలి... కొట్టుపనుంది. అక్కడే హోటల్లో రాత్రికి భోంచేసి తెల్లారి వెడ్తాము. పని ఏ వేళకు తెములుతుందో?..." అన్నాడు మాఆవిడ బాబాయి.

నాడ్యూటీ పూర్తి ఐనట్లు మాట్లాడకుండా ఊరుకున్నాను. ఐదురూపాయలు మటుకు ఒక్కరూపాయన్నా అడగలేను. మాటల సందడిలో సతీమణి ఆమాటను తేలకొట్టి వేసింది. ఒక్కపూట భోజనానికి ఐదురూపాయలు... ఆవ్యథ మటుకు అతని ముఖంలో తారాడింది.

  

## ★ నిర్దోషి

వేగంగా పరుగెత్తుతున్న మోటారుకారు గతుకుల్లోకి వంగి లేస్తున్నకొలదీ నిర్భయంగానైనా చట్టవిరుద్ధమైన పనిని చేస్తూన్న నాలో రకరకాల ఆలోచనలు తొణికిస లాడుతున్నాయి. గృహ సమస్యలలో చిటికిపోయిన నామనస్సు ఈ పరీక్షాసమయంలో మత్తుగా నిద్రపోయింది. నేనుచేస్తున్న ప్రతిపనినీ లౌకిక దృష్టితో విమర్శించుకునే నాహృదయం మాత్రం సంచలనం కల్గించింది.

నేచేస్తున్న పని తప్పా? ఈచిన్నప్రశ్న ఒక పెద్ద సమస్యయై నన్ను ఒక్కొక్కోణంలో ఒక్కొవిధంగా బాధించ సాగింది. నిజమే! బహిరంగంగా, తప్పో ఒప్పో చేస్తూన్న ప్రభుత్వ యంత్రాన్ని తిరస్కరించడం న్యాయసమ్మతం కాక పోవచ్చు. కాని, నైతిక విలువల యదార్థరూపాన్ని తెలుసుకోగలిగిన కొందరు మాత్రమే నాకడుపులోని మంటకు సానుభూతి చూపగలరు.

మానవుడు నాగరికుడైంది కడుపునిండా తినలేని స్వాతం
త్ర్యాన్ని కొని తెచ్చుకునేందుకేనా? సాధారణ కార్మికుడి
నుంచీ రాజుగారి కిరీటాల్లో మత్తెక్కి మసులుతూన్న ధనికుని
వరకూ దినదినం తప్పని సమస్య కడుపు నింపుకోవడం ఒకటే.
ఇదే సృష్టిరహస్యంలోని ప్రాథమిక సూత్రం.

కానీ నావంటి అభాగ్యునికి కడుపునిండా తినేకాలు
పోయింది. రేషనింగు అధికారులకు దడిచి కాలేకడుపును సగ
మైనా నింపుకోకుండా సకసక లాడుతూ జీవనోపాధికోసం
లోకంతో ముష్టియుద్ధం చేయాలి. పరిభుత్వానికి వెఱచే మా
నైతికంగా బలహీనమై పోవాలి. నాజీవితంలో యీ చిక్కు
ముడి విడివడే రోజున్నదా? అన్నదే ఒక యక్ష ప్రశ్న.

రెండు రోజులనుంచీ భోజనం లేక శుష్కించి పోయిన
గాలో యీ వ్యూహాలన్నీ బలంగా, భారంగా తిరుగుబాటు
కేసినట్లు ఐంది. ఇల్లాలు పరిసమించింది, పెద్దదాని భర్త త్రాగు
లైతై ఆస్తి కాస్తా అమ్మేసిన దగ్గరనుంచీ మరొక కొడుకు
ాంగా అదికూడా నాయింట్లో వుంటూన్నది. నాలుగేళ్ళ
త్యం ఆకలితోనే రోగానికి గురిఅయ్యాడు. రెక్కలు
ముచుకొని నెలకు ఇరవై రూపాయలు తెచ్చుకునేనాకు ఆలి

బిడ్డలకు కడుపునిండా పెట్టి కంటినిండా నిద్రపోనిచ్చే అర్హత కూడా లేకపోయింది. దీనికితోడు రేషనింగు బాధలొకప్రక్క. ఈ పరిస్థితులలో యిరుకునపడ్డ నాకు మొండితనంగా నల్ల మార్కెటు బియ్యం కొనుక్కోవలసిన అవుసరం తప్పలేదు.

ఆలోచిస్తూ, ఆలోచిస్తూ తెప్పరిల్లి చూసిన నాకు ప్రయాణం చేస్తూన్న కారు ఆగిపోయినట్లుగా తెలిసింది. కారణం తెలియక విస్తుపోయి చూశాను. యముడు లాంటి బుఱ్ఱమీసాల రాయుడొకడు లాటీకర్ర చేతిలో పట్టుకుని కారులోకి తొంగి చూస్తున్నాడు. కారులోని వాళ్ళంతా అతని వంక తేరిపార చూశారు. నేను మాత్రం నిముషంలో పసిగట్టాను, అతను రేషనింగు చౌకీదారని. అతనికి భయపడ వలసినవాళ్లు, భయపడనివాళ్ళు, అంతా ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు, తారతమ్యం లేకుండగా. ఏమో! ఎవరు భయ పడినట్లు కనిపిస్తే ఎవరిని అనుమానిస్తాడో? నాకిదంతా విచి త్రంగా తోచింది. ఇంతలోకే అతని వాడివైన చూపులు రెండుకాళ్లలో సంచిని యిరికించుకుని మూతిబిగించి పట్టుకొని కూచున్న నామీద పడ్డాయి.

మునివేలు నావంకచూపిస్తూ "అదేంటి?" అన్నాడు, మేఘంలాగ గర్జిస్తూ, నాకడుపు మంట నన్ను చలింపనివ్వ

లేదు. నింపాదిగా కూచుని తొణకకుండా అన్నాను.
"బియ్యం"

"రేషనింగు బియ్యమా?" ప్రశ్న వేశాడు.

"కాదు" నేనన్నాను, "రేషనింగు బియ్యమైతే పరాయివూరు నుంచి తెచ్చుకోవాల్సిన అవసరమేముంది?"

"అయితే కొంపతీసి బ్లాకుబియ్యమా?" బుజ్జిమీసాల రాయుడడిగాడు.

మెల్లిగా నవ్వుతూ తలకాయ వూపాను.

అతనికి నామీద రావల్సిన కోపానికన్నా ఎక్కువగా జాలి వేసినట్లుంది. కనుబొమలు ముడుస్తూ వికారంగా నాలో తుకు పోయిన కళ్ళలోకిచూసి అన్నాడు,

"నీవెక్కడో పిచ్చిబాపనయ్య లాగున్నావు. దొంగ బియ్యం కొంటేమాత్రం దక్కించుకునే పద్ధతి తెల్సుకోవద్దా? నీవు అమాయకుడివి కాబట్టే కండలుతిని ఎముకలు మెళ్లో వేసుకుంటున్నావు. ఇప్పటికన్నా జాగ్రతపడవయ్యా" నాలోని దైన్యత్వం అతని అధికారాన్ని జాలితో నిండిన దబాయింపుగా మార్చింది.

నేనేమీ మాట్లాడలేదు. ఈచోద్యమంతా చూస్తూన్న ప్రయాణీకులు ఇతనెవరో పిచ్చివాడులాగున్నాడు అన్నట్లుగా చప్పరించారు.

మళ్లీ చౌకీదారు అందుకొని "సంచిని సీటుక్రిందకైనా నెట్టెయ్యవయ్యా, బ్రతికిపోతావు" అన్నాడు.

"దొంగతనం చెయ్యమంటావా?" అన్నాను సూటిగా. "అతనికి కోపం వచ్చింది, ఐతే నీవు చేస్తున్నపని దొరతనమా?" అడిగాడు.

"ఔను నేను చేస్తున్నదేమీ దాచుకోలేదు. నీకు కనుపిస్తూనే వున్నదిగదా!" అన్నాను.

"మరి శేషనింగు ఆఫీసుకు నడుస్తు!"

"ఎందుకూ నడవడం? పావలాయిచ్చి ముందే టిక్కెట్టు కొనుక్కున్నాను."

నాచలోక్తికి అతను వుడికి పోయాడు. సమాధానం చెప్పే సహానంగాని సమయస్ఫూర్తిగాని అతనికి లేకపోయింది.

చట్టున కారులోకెక్కి కూర్చుని డ్రైవరుకు సౌంజ్ఞ

చేశాడు. కారు కదిలింది. నేనుమాత్రం ఇసుమంతైనా భయ పడలేదు. నాప్రక్క వాళ్లలో గుసగుసలు బయల్దేరాయి. ఇదేదో కేసవుతుందనీ, నాకు శిక్షో జరిమానో పడుతుందనీ వాళ్లు గొణుక్కుంటున్నట్లుగా నేను గ్రహించాను. కారువెళ్లి, రేషనింగు ఆఫీసు దగ్గరగా నిల్చింది.

బుజ్జి మీసాలరాయుడు నన్ను తీసుకు వెళ్లి ఆఫీసరు వద్ద నిలబెట్టి సలాముచేసి "ఇదుగో ఇతన్ని పట్టుకున్నాను సార్" అన్నాడు. రేషనింగు అధికారి మాయిద్దరివంకా చూశాడు. నేను ధైర్యాన్ని చిక్కబట్టుకొని వెంటనే అడ్డు కున్నాను, "కాదు. నేనే ఈచౌకీదారును పట్టుకున్నాను."

ఇతనెవరో గౌరవ మర్యాదలు తెలియని అడవి మనిషిలాగున్నాడు అన్నట్లుగా చూశాడు అధికారి. చౌకీ దారు భయంతో, ఆశ్చర్యంతో వణికిపోయాడు.

"ఏమిటి నీవు పట్టుకున్నది?" అధికారస్వరం గర్జించింది. నేను లౌకిక మర్యాదకోసం వినమ్రుడనై అన్నాను, "తప్పు చేసిన యీ చౌకీదారును పట్టుకుని మీవద్దకు తెచ్చాను. మీరే న్యాయం..."

"నీవు అధికారి ముందునిల్చున్నావు. జాగ్రత్తగా మాట్లాడాలి." ఉరిమి చూశాడు ఆఫీసరు.

అంతలోనే భుజాలు తడుముకున్నాడు చౌకీదారు.

"కాదు బాబూ దొంగబియ్యం కొనుక్కువస్తున్న ఇతన్ని నేనే పట్టుకుని ఆఫీసుకు తెచ్చాను"

నేను అన్నాను, "అదంతా అబద్ధం, కావలిస్తే ఆ కార్లో వెళ్ళిన ప్రయాణీకులందర్నీ అడగండి. మీ చౌకీదారే నాలుగు పెద్ద తప్పులు చేశాడు. అవసరమైతే ఋజువుకూడా చేస్తాను."

"ఏమిటా తప్పులు?"

"వినండి చెప్తాను," నేను ఏకరువుపెట్టాను, "దొంగ బియ్యం నావద్దవున్నది చూచికూడా అధికార్లకి పట్టుబడకుండా దాచుకోమని నన్ను ప్రోత్సహించాడు. నేను చట్టవిరుద్ధంగా ప్రవర్తించినపుడు నన్ను ప్రభుత్వానికి పట్టించాలి. అంతేకాని తప్పుచేస్తున్న వాడిచేత ఇంకా పెద్దతప్పు చేయించటమే అతని కర్తవ్యం కాదుకదా?" ఇదేనా చౌకీదారు నిర్వర్తించవలసిన ధర్మం? నేను అబద్ధమాడడానికి నిరాకరించాక

తనుచేస్తున్న పనిమానుకొని నావెంట ఆఫీసుకు వచ్చాడు. అతను కాపలా లేనందువల్ల నిరాటంకంగా ఎన్నిమూటలు దొంగబియ్యం ఫ్యాక్టరీకి వచ్చాయో! ఇందుకేనా ప్రభుత్వం చౌకీదార్లను నియమించింది? పరియానీకులున్న కారును స్వార్థంతో గమ్యస్థానానికి పోనివ్వకుండా శేషనింగు ఆఫీసుకు తోలించుక వచ్చాడు. ప్రభుత్వపు సొమ్ము తింటూ ప్రజా సేవకుడుగా నుండవలసిన చౌకీదారు చేయవలసిన పని యిదేనా? అన్నిటికన్నా ముఖ్యమైంది నన్ను పట్టుకున్నానని మీతో ఒక పెద్ద అబద్ధమాడేశాడు. ఇవన్నీ తప్పులూ నేరాలుకావా? చెప్పండి.'' శేషనింగు ఆఫీసరు నిరుత్తరుడై అన్నాడు, ''పొతే నీమీద కేసు బనాయించనక్కర్లేదు అంటావా,''

నాఆకలిలోనుంచి ఆవేశం పొర్లుకొని వచ్చింది, "పెట్టండి. కేసు పెట్టినపుడు న్యాయమూర్తి నోటిగుండా వెలువడే నగ్నసత్యాలకే మనమంతా కట్టుపడదాం. హృదయంగల మానవుడెవ్వరైనా కళ్ల యెదుట కనుపిస్తున్న సత్యాన్ని నిరసించగలడా?"

చౌకీదారు ముఖం వెలవెలా పోయింది. ఏడుపు ముఖం పెట్టి రెండుచేతులు నలుపుకుంటూ? "ఇదంతా ఒక

పెద్ద అభాండం. నన్నురక్షించాలి స్వామీ" అన్నాడు, ఆఫీసరు వంకచూసి.

సమాధానం కోసం నేను ఎదురు చూస్తున్నాను.

ఆఫీసరు తికమకపై పోయాడు. నోటివెంట మాట వెలువడలేదు.

నేను ప్రశ్నార్థకంగా ఆఫీసరువంక చూశాను. వున్నట్టుగా వుండి కుర్చీలోనుండి లేచి నావంకచూసి "మీరు వెళ్ళండి. విషయం తర్వాత ఆలోచిస్తాను." అన్నాడు, ఏమీ తోచని అధికారి.

ఎలానో దక్కిన బియ్యపు మూట తీసుకుని తేలిపోయే కాళ్ళతో, నీరశించిన శరీరంతో యింటికి చేరాను. ఆసంఘటన జరిగాక మూడు కొత్త క్యాలండర్లు కొన్నాను కానీ, నామీద కేసెవరూ బనాయించలేదు.

ఇది గుర్తొచ్చినప్పుడల్లా నేను అనుకుంటాను, ఆఫీసరు వద్దకెళ్ళి కేసెందుకు పెట్టలేదు? అని అడుగుదామని.

  

★ అడకత్తెర

పగలంతా పనులకోసరం పరుగెత్తి, రైలువేళకి స్టేష నుకువచ్చి చేరాను. యుద్ధానంతరం డబ్బు విలువ తగ్గిపో





"గుడ్ నైట్ స్టేషన్ మాస్టర్."



యింది. కల్పించుకున్న ప్రయాణాలు పెరిగిపోయినవి. ఏబండి చూసినా జనం క్రిక్కిరిసి పోతున్నారు. ఎక్కువ డబ్బు తగలేసి,

టిక్కెట్టు కొనుక్కున్న యితరతరగతుల్లో మూడవతరగతి పెట్టెలలోకన్నా ఘోరంగావుంది. అందులో యీ బియ్యపు మూటల హడావిడి నిప్పుకు గాలితోడైనట్లుగాఐంది. రైలు పరుగెత్తేప్పుడు కడ్డీలుపట్టుక వ్రేలాడుతూన్న ప్రయాణీకులను చూస్తే వీళ్లు ప్రాణాన్ని అంత తేలికైన వస్తువుగా భావి స్తారా?... అనిపించేది. కాని దీర్ఘంగా ఆలోచించిచూస్తే దీనికి సరియైన కారణం తాపత్రయమని తెలుతుంది.

రైలు కదిలిందాకా, క్షణాని కొకరు తలుపు త్రోసు కొని లోనికి ఎక్కుతూనేవున్నారు. పెట్టెఅంతా బియ్యపు మూటలవాండ్ల గొడవతో నిండిపోయింది. కూర్చున్న నలు గురికీ గాలి ఆడటానికైనా వీలులేనట్లు బియ్యపు బస్తాలు వేశారు? అసలు కక్కసు దొడ్డిని మొదటే కంట్రాక్టు పాడేసి నట్లుంది. ఒకరికి దగ్గరగా ఒకరు కూర్చుని, బియ్యపు వ్యాపా రంలోని స్వానుభవాలు విసరుతూ, టిక్కెట్టు పరీక్షకులను విమ ర్శిస్తున్నారు. మానవుడి మాటలలో, కార్యరంగానికి చాటుగా వున్నప్పుడు, ప్రగల్భాలకు వున్నంత అవకాశం మరి దేనికీవుండదు. నా రెండువాడిన కన్నులూ, బారులు తీరిన అక్షరాలలో చరచరాచొచ్చుకపోలేదు. పుస్తకం మూసి, అంతటి రసాభాసలో నూ స్వేచ్ఛగా చెవులను వదలడానికి నిశ్చయించాను.

పెట్టెలంతా కలియచూశాను. ఎదరు బెంచిలో కొం చెం ప్రక్కగా ఒక పాలిపోయిన ముఖం కనిపించింది. ముఖంలో అమాయకత, కండ్లలో బెదరు నాకు స్పష్టంగా కనుపించినవి. పరిశోధకులెవరైనా తలవని తలంపుగా వస్తా రని అతను భయపడుతూ వుండి వుంటాడు. మిగతా అంత మందిని తప్పించి, అతనుచేస్తున్న ఘనకార్యం ఏమీలేదు. కాని ఎందుచేతనో, అతను నాదృష్టిని బాగా ఆకర్షించాడు. ఆ శల్యశరీరుని గూర్చి తెలుసుకోవాలన్న అభిలాష నాలో అధికమైంది.

నేను యీ విషయాన్ని ఆలోచిస్తూ, కిటికీలోంచి తల వంచి క్షణాని కొకరంగు మార్చుకుని, శోభను అతిశయింప జేస్తున్న మబ్బులను చూస్తూ కూర్చున్నాను. మెల్లిగా నన్నె వరో తట్టినట్లనిపించింది. వెనుకకు తిరిగి చూశాను. అతనే- ఆపాలిపోయిన ముఖం, "బాబూ! ఈస్టేషనులో టిక్కెటు తనిఖీదార్లు ఎక్కువగా వస్తుంటారా?..." అన్నాడు. అతని ధోరణి చూసి నాకు నవ్వొచ్చింది కానీ నవ్వలేదు. కాస్సేపు విదానించి,

"ఇదేనా తొలిసారుగా బియ్యానికి రావడం.

కొత్తగా మాట్లాడుతున్నావు..." అన్నాను. ఒకమారన్నా యీ లంచాలకు అవినీతికి మరిగివున్న అధికారుల తాపు తిని వున్నవాడైతే యిలా అడగడని నాఅభిప్రాయం.

బహుజనమర్త్రితగా సమాధానం చెప్పాడు. "ఔను స్వామీ! ఇదే మొదటిమారు. ఈశరీరం అన్నిటికీ రోసి పోయి చివరకు యీపనికి పాల్పడ్డది."

పుష్టిలేక లోతుకు పీక్కుపోయిన అతని కళ్ళలోకి చూశాను, "అన్నీ అంటే, అవేమిటి?"

"మీవంటివారు వినదగినదికాదు." అతనికళ్ళు చెమ్మగిల్లాయి, "భార్యా కొడుకూ చనిపోయాక, లేనిపోని నేరాలు మోపి సంఘం నన్ను వెలేసింది. తగినస్థితి లేకపోబట్టి తిరుగా దానినే నేను వెలి వేయలేక పోయాను. పైగా నలుగురిమధ్యా తిరిగి వ్యాపారం చేసుకునే రోజులు పోయినవి. విరక్తి కలిగినా బలత్కార మరణం నాకు అలవి తప్పినదైంది. చివరకు యీ పనికి..." అన్నాడు.

అతను చెప్తుతున్నంతసేపూ ముగ్ధుడనై విన్నాను. ఆమనిషి స్థితిచూసి నాకెంతో జాలికలిగింది. కాని అతనికి

నేను చేయగల సహాయమేదో నాకు అర్థం కాలేదు. అతను చెప్పిన దానిలో ఒక్కొక్క విషయాన్నే తీసుకుని ఆలోచిస్తూ కూర్చున్నాను.

బండి పదినిముషాలకు బయలుదేరుతుందనగా నలుగురు పోలీసులు ఎక్కారు. ఇహ బియ్యపు మూటలవాండ్ల క్షోభ ప్రారంభమైంది. ఎవరి ధోరణిలో వాళ్లు మాట్లాడారు. నా ఎదురుగా కూర్చున్న పాలిపోయిన మనిషిని, అతని బియ్యపు మూటతో సహా దింపివేశారు. ఏవిధంగానూ ఆ సమయంలో వాళ్లను ప్రతిఘటించడానికి నా ఒక్కడికి సాధ్యపడలేదు. ఏదీ తోచక పోలీసులు వెళ్లి నిలుచున్నవంక చూశాను.

రైలు కదిలిన తర్వాత, ఆ పాలిపోయిన మనిషి చెమటలు కక్కే శరీరంతో, వట్టిచేతులతో వచ్చి పెట్టెలో చేరాడు. నిరాశ ఎక్కువ మోతాదులో అతనిమీద తాండవమాడింది. లోపలకువచ్చి కూర్చోగానే "ఏమిటి?" అన్నాను. ముఖం చిట్లించుకొని, "ఎంత కావాలో అంతా అయింది..." అన్నాడు.

జరిగిన విషయం అతనుచెప్పగా విన్న నాకే ఆశ్చర్యం వేసింది. పట్టపగలే బహిరంగపు దోపిడీ చేస్తున్నది యీ

వుద్యోగవుమూక. ప్రభుత్వపు ప్రతినిధులనే పేరుతో పోలీసులు కొందరి దగ్గరినుంచి డబ్బుతీసుకొని వదిలేశారు. కాని పాపం యితని ఖర్మ మిలాకాలింది బెదిరించి పారిపోయిన మనిషిమూటే కాజేశారు. అతను నోరువిత్తి అన్యాయాన్ని గురించి అరచినా, ఎవరూ వెళ్ళి సహాయం చేయలేదట. ఈ పోలీసులు పట్టుకున్న నూరు మూటలలో ఒక్కటైనా, గమ్య స్థానం చేరుతుందన్న నమ్మకం ఎవరికీలేదు.

"ఐతే ఏమిచేస్తావు?"...అన్నాను సానుభూతి చూపుతూ.

"ఇంటికివెళ్ళి నిద్రపోతాను."

అతను నావంక విచిత్రంగా చూశాడు.

"జౌను... మీాకుఅర్థంకాలా? ఈపాపసీమకు దూరమవ్వేందు కు శాశ్వత నిద్ర"

"తప్పు"

"నా విషయంలోకాదు. ఐనా ఆలోచిస్తా"

ఆతర్వాత అతను నిశ్శబ్దంగా కూర్చున్నాడు. అతని ముఖకవళికలు ఆకలిబాధకు, అసంతృప్తికి క్రీడగా పనిచేస్తు న్నాయి. పక్క స్టేషనులో నేను దిగివెళ్ళాను. వెళ్ళేప్పుడుకూడా ఒకమారు అతనినిచూసి మరీ దిగాను.

తరువాత రెండురోజులకు గుంటూరు ప్రయాణంవచ్చింది. ఎక్కడ పనిచేస్తున్నా నా సన్నిహితవాతావరణాన్ని కలవరపెట్టే చిన్న సమస్యలనుగూర్చి ఆలోచించడం నాకు అలవాటు. ప్లాటుఫారంమీద "మెయిల్ స్ట్రీము" చదువుతూ వెళ్ళుతున్నాను. అకస్మాత్తుగా అతను... ఆ పాలిపోయిన మనిషి కనిపించాడు. వేపచెట్టునీడలో కళ్లుమూసుకొని నిస్సారంగా కూర్చుని వున్నాడు. గుర్తుపట్టి అతనిని నేనే పలకరించాను. అతను నాలాంటి దుస్తులు ధరించిన వ్యక్తి వచ్చి పలకరించినందుకు ఆశ్చర్యపడివుంటాడు. గుర్తుపట్టలేక ఒకనిముషం కన్నార్పకుండా చూశాడు.

నేనే అందుకున్నాను. "ఇంతదాకా మీవూరు వెళ్ళలేదేం?

"ఎల్లా చేరను?" కంఠం సన్నగిల్లింది. మాటలో వెనకటి పరుకుదనం చనిపోయింది.

"మళ్ళీ ఏం జరిగిందేమిటి?"

"మీరు అక్కడ దిగిపోయాక పరిశోధకుడు వచ్చాడు," న్నాడు దైన్యంగా. అప్పుడు తెలిసిందినాకు. "బియ్యపుగొడవలో టిక్కెట్టు జారిపోయింది. ఉన్న డబ్బు కాస్తా తీసుకుని యి

క్షమించేశాడు. ఈ రెండు రోజులూ గంగమ్మ ముట్టలేదు..."

"బక్షీసు యిచ్చాడా!"

"ఊహు...ఏమీ యివ్వలేదు బాబూ!"

"ఈపాడు వ్యాపారాలన్నీ ఎందుకు? యింటికి వెళ్ళి ఎలాగో, పొట్టపోషించుకోడానికి ప్రయత్నించు. నీకైనా సులువుగా చేసుకదా?"

అతను తలూపాడు.

దూరంగా పొగలుగక్కుతూ వస్తూన్న రైలునుచూసి, పదియూపాయలకాగితం అతని చేతికి అందించాను. అతను సిగ్గుపడ్డాడు. అందుకునేప్పుడు చేతులు వణికాయి.

"మీవంటి వ్యక్తులకు సాధ్యంకాని దయను మీ హృదయంలో చోటు యిచ్చారు"... అన్నాడు. "కృతజ్ఞుణ్ణి వందనాలు."

"మంచిది" అన్నాను.

రైలుబండిలో ఎక్కినా నాబుర్ర పనిచేస్తూనేవున్నది.

అధికారవర్గం ప్రజల జీవితంమీద అడకత్తెరలా ఉపయోగ పడుతున్నదా?— అనుకుంటున్నారు వాదనలోపడ్డ యిద్దరు ప్రయాణీకులు.

"అంతే" అన్నది సూటిగా నామనసు.

  

మూడవ జ్యోతి ప్రచురణ





# “కన్న కడుపు

[ నిరీక్షింపదగిన నవల ]

ర చ న

కొత్త వెంకట గోవిందరావు.

